# అభినవసరస్వతి

## స్వవిషయము.

ప్రకృతము కొంతకాలవిలంబముమీఁద రెండుసంచికలును నొక్కమారె వెలువడుటకు ముఖ్యకారణములు ప్రెస్సు పూర్వస్థానమునుండి మఱియొకస్థలమునకు మార్చుకొనుటకుఁ బెక్కుదినములు పట్టుటయు నేనుసకుటుంబముగఁ దిరుపతియాత్రచేసికొని వచ్చుటయు నటుపైని నాశరీరమున యత్కించి దనారోగ్యమేర్పడుటయునై యున్నయవి ఇఁక ప్రెస్సువారు తమకుండు కార్యభారముచే మాకింపుకరావీలులేనిసమయమున నుపేక్షించి పడవేసియుంచుట మామూలుపద్ధతి యను సర్వజనవిదితమును గాన మిక్కిలి వ్రాయుననవసరమని యీసారి యయిన యాలస్యమునకు క్షమింపఁ జందాదారులను వేడుకొనుచున్నవాఁడను.

## గ్రంథస్వీకారము.

— 1 అవధానదర్పణము, 2 సువర్ణముఖి, అను రెండు గ్రంథములు మాకార్యస్థానములంకరించినవి. వీనిపై మాయభిప్రాయము ముందుఁ దెలుపఁబడును.

---

8—3—13 చెన్నపురి.

అక్కిరాజు ఉమాకాంతం అనేకనమస్కారములు ఈక్రింది యుత్తరమును మీపత్రికయందుఁ బ్రకటింపఁగోరుచున్నాను

చిత్తగించవలెను, అ॥ ఉమాకాంతం.

(ఈయుత్తరము నాకు బెజవాడనుండి యొకరువ్రాసిరి)

"నేనతగుమనని బింకంబులుగొట్టుచుఁ గొప్పరవుకవులచేఁ బరాభవమునొందిన యా.. వ్రాసినసీసపువ్రాఁతలఁ జూడఁగని (యతని) యజ్ఞానంబునకై నగుచును నొక చిరువ్యాసవ్రాసితి. అయ్యది చూచి మ
కొన్నివిద్యలు నేర్చినాడనని గర్వంబునొంది 'ఏమోయీ . ఉమా

కాంతంగారికి నాకు లడాయిజరుగఁబోవుచున్నది చూచెదవు" అని చెప్పుచు......గా రాబుక్కాను నాదగ్గఱకుఁగొనివచ్చి గొప్పగఁ జూప వచ్చిరి. "అయ్యా, సూర్యునిఁబోడఁగని మిణుఁగురు పురుగు ప్రాధాన్యత యున్న ట్లీదుర్మార్గులు సెమ్మవ్రాఁతలు వ్రాయుచున్నారని నేనంటి. వానికై యాయన పెడమొగము పెట్టికొని చిన్నపుచ్చుకొనెను...... ఉపాధ్యాయుఁడగు... గారు మీరు కృష్ణాపత్రికలో వ్రాసినదిచూచి మీతో నేకీభవించి.... రావుగారిని నోరడచుటలో సహాయంబై రి ఆయన నాకన్న నెక్కుడుగ మీయుద్దేశముచు జర్చించి నిర్ధారణచేసినారు. అయినను దానుబట్టిన కుందేటికి మూఁడేకాళ్లన్న నేమిసేయఁగలము?"

ప్రమాదీచ సంవత్సర సిద్ధాంత పంచాంగము.

ఇయ్యది రాజా వాసిరెడ్డి చంద్రమహేశ్వర ప్రసాద్ బహద్దరు జమీందారుగారి యాస్థానవిద్వాంసులగు బ్రహ్మశ్రీ పురాణం రామచంద్రశాస్త్రిగారిచే సిద్ధాంతితమై మాకార్యస్థానమలంకరించియున్నయది. సాధారణముగా సర్వత్ర ప్రచురమగు పంచాంగములవలెంగాక నిర్దుష్టమై విద్వజ్జనపఠనీయమై యలరారుచున్నయది పంచాంగకారులు కేవలసిద్ధాంతులుగాక సంస్కృతాంధ్ర ప్రబంధరచనాధురీణులగుటచే నిది యింతవన్నెకెక్కినది. ఇందు సందిగ్ధాంశములు వచ్చినచోట పూర్వపక్షసిద్ధాంతములతోఁ దగురీతిఁ జర్చించి శాస్త్రసమ్మతముగ స్వమతము స్థిరీకరింపబడియున్నయది. "మణినావలయం వలయేనమణిః" అన్నచాయ జమీందారుగారిద్వారా శాస్త్రిగారును శాస్త్రిగారిద్వారా జమీందారుగారును బ్రతిష్ఠావంతులయియుంట యే యిత్యాదిగ్రంథకరణమునకు ముఖ్యకారణమైయున్నయది. ఇట్టివిద్వాంసుల స్వస్థానంబుననిలిపి లోకోపకారకులగు శ్రీ చంద్రమహేశ్వర ప్రసాదభూమీశులు సర్వదా సర్వేశ్వరుఁ డు సంరక్షించుచుండుఁగాక,

---

సందర్భములు తెలియవేమో అని సంశయించుటకుఁ గల గుఱుతులు పెక్కులున్నవికాని యందులో పైని జూపినయంశ మొకగుఱుతు, ఈకాళిదాసు ప్రకృతము వినయమునుజూపినమాట సత్యమే. శాకుం తళములో నింతవినయమును జూపినట్లులేదు.

"అభిరూప భూయిష్ఠా పరిషదియం, తదద్య కాళిదాసగ్రథితవస్తునా నవేననా టకే నోపస్థాతవ్యం॥"

చూచితిరా, యీవాక్యమునందలి గర్వము, ఆసభలోఁ బండి తులు చాలమందిగలరఁట? ఆహేతువునఁ గాళిదాసుగారినాటక మాడవ లయునఁట? కావ్యజీవితమగు వ్యంగ్యవైభవము నించుకేని దెలిసిన మానిసి కీవాక్యమువలనఁ గాళిదాసున కెంతగర్వముకలదో వ్యక్తము గాకమానదు. ఒకభేదము మాత్రము లేకపోలేదు. పండితరాయాదిక వులవలె నీతఁడు పెద్దశ్లోకములోఁ జెప్పక వచనములోఁ జిన్నమాట తోఁ జెప్పికొన్నాఁడు. ఈగుణమిచ్చట నుతించుట కెవ్వరి యభ్యంతర మును నుండదు. గర్వము లేదని సాధించువారుగూడ నున్నచో వారికి వందనములర్పించెదనుగాక ఇదియిటులుంచి రావుగారు కేట్లాగులు మాత్రమే సంపాదించి చూచి యంతతోఁ దృప్తిచెంది,

"మాతృభాషానభిజ్ఞులయిన యీమూర్ఖుల యజ్ఞానమునకు । జాలినొంది వీరిని క్ష మింతమనుకొనుఁడు॥"

లోనగు సాహసవాక్యములను బ్రయోగించుచు నాయీయా పండితులను దూషించుట యింకనేనిమాని నేమొదట నుదాహరించిన పద్యార్థ మిదివఱకే వారికిఁదెలిసియుండునుగానఁ దగు మార్గములోని కివచ్చి నెమ్మదిపడుదురుగాక యని వేఁడికొనుచు మఱికొంత నాకుఁ దోఁచినవిషయము వ్రాయుచున్నాఁడను. ఒకకాళిదాసే యొకచో వినయమును మఱియొకచో గర్వమును జూపుటచేత సముదాచితము

గ గర్వవినయములను జూపుట సూరులకు శూరులకుంబోలె సాజమ ని తేలుచున్నది. ఆయీయంశములు, 6 వ పుటలోఁ దమకుఁగల పాం డిత్యాభి వ్యక్తికొఱకై మామ్మిత్రులేకరువుపెట్టిన (1) కావ్యప్రకాశిక, (2) విశ్వగుణాదర్శము, (3) ధ్వన్యాలోకము (4) వాసవదత్త (5) ఉత్తరరామచరిత్ర, (6) విష్ణుపురాణము, (7) కవిజనాశ్రయము, లోనగు గ్రంథములలోని శ్లోకములవలనఁగూడ సమర్థింపవచ్చును. తుట్టతుదను శ్రీనాథునియొక్కయు సంకుసాల నృసింహకవియొక్కయుఁ, బేరెత్తిగాన వారిగర్వమును దెల్పుపద్యము లిం దుదాహరించు చున్నాఁడను.

శా॥ ఈక్షోణిని నిన్నుఁబోలు సత్కవులు లేరీనాఁటికాలమ్మునన్
ద్రాక్షారామపురీవిహారవర గంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయకుంభికుంభఘుసృణద్వైరాజ్యభారమ్మున
ధ్యక్షించున్ గవిసార్వభౌమ! భవదీయప్రౌఢ సాహిత్యముల్॥ 1

శ్రీనాథుఁడు.

తే॥ గీ॥ యతి విటుఁడుగాకపోవుటెట్లస్మదీయ, కావ్యశృంగారవర్ణనాకర్ణనమున
విటుఁడుయతిగాకపోరాదు వెసమదీయ, కావ్యవైరాగ్యవర్ణనాకర్ణనమున॥

సంకుసాల నృసింహకవి.

ఈరెండుపద్యములవలనను శ్రీరావుగారి వాదము పూర్తిగా నడుగంటుచున్నది. దీనినిబట్టి రావుగారు సంస్కృతమునందుంబలెఁ దెలుఁగునందుఁగూడఁ బ్రవేశముచాలనివారనియుఁ బూర్వోత్తరసందర్భము తెలుఁగనివారనియు సాధించుట కడుసులభమేకాని యింత పెద్దపొత్తమును వ్రాయుటయేకాక ప్రసక్తిలేని ప్రసక్తిగా నెంతోయుక్తియుక్తముగాఁ గోడమీఁది పిల్లినాటముగా నేఁటికవులలోఁ బ్రసిద్ధులగువారిని

బడఁదిట్టుటయేకాక యింగ్లీషు నవలలను నుతించు మిషచేఁ గాదంబరిని దూఱుపాలుఁబట్టుటయేకాక, నేఁటికాలమునం దెంతో యోగ్యులును సంస్కృతాంధ్రహూణభాషాకోవిదులును బరమశాంతులునునగు మా గురువరేణ్యులు మ॥రా॥రా॥ చెన్నాప్రగడ భానుమూర్తిగా రొకప్పు డు వీ రవధానములనుగూర్చి తెలిసియుఁ దెలియని జ్ఞానముతోఁ జేయు ప్రసంగమున కించుక యడ్డుపెట్టిరను హేతువున వారిభాషలో గ్రామ్యతాదోషమున్నది లోనగు నంశములతోఁ గృష్ణను నిందించుటయేకాక యింకను నిట్టి సాహసములెన్నో చేయనున్నవారును శ్రీనాథకవినిగూర్చి కొంత పల్నాటివీరచరిత్ర పీఠికలో నెత్తికొని వ్రాసియున్నవారును నగు వీరికి తెలుఁగు పుస్తకములలోనే ప్రవేశములేదనుట జనులకు విశ్వాస్యముకాదుగాన నట్లనక యిక్కాలమ్మునను౦షు "పగటివేషగాం" డిది కనిపెట్టుదురో లేదో చూతము చమత్కారమునకు వ్రాసియుందురనినచో శ్రీకాంతకవిగారి పాండితీ గౌరవమునకు సుంతయు భంజకగాకపోవుటచే వారు నన్నుఁదిట్టకుండుట తటస్థించెడిని. లేనిచో నింకొక "సుల్తాను"లో వీరు నన్నుఁగూడఁ దిట్టక తప్పదు. ఔరా? గర్వభావము, ఔరా? వినయము? శాంతంపాపం, ఇఁక నొకవాక్య మీసందర్భములోనిదే విమర్శించెదను. గాని పూర్వవాక్య విమర్శనములోఁ గవిమాత్రులెల్ల సమయోచితముగ గర్వోక్తుల నాడినవారేయనియు వలసినచో వారివారి గ్రంథములు చూచుకోఁదగుననియు నంతవఱకును శక్తిచాలనిచో బ్ర॥ శ్రీ॥ తిరుపతివెంకటేశ్వరకవిశిఖామణులు రచించిన కవిసింహగర్జితము లేని జదివికోఁదగుననియు నేను మనవిచేయుటను టిప్పు "సుల్తాను"కవిగారు జ్ఞప్తియందుంచుకొనఁ బ్రార్థింపఁబడుచున్నారు.

"కవిచక్రవర్తి, కవిఘటాపంచాననేత్యాది దంభబిరుదములందాల్చి యిప్పుడు గర్వోక్తులాడువారికాళిదాసునికంటె ఘనులా" ఘనులుకారు, ఘనులమనిమీమనస్సులోనివసించియున్నయాకవు లెక్కడను వ్రాసికొన్నట్లు కనుపట్టదు' కాని నాకుఁదోచినది మనవిచేసికొనుచున్నాఁడను, అందుకు ముందు మీగ్రంథములోని యీవాక్యమును జిత్తగింపుఁడు

,ఈవాక్యములు కాదంబరిలోనివి ..చివరవఱకు సుజ్జయినీవర్ణనముచేయఁబడినది, ..ఇవ్విధమున సందర్భములేని యుపమలయొక్కయు శబ్దశ్లేషలయొక్కయుఁ జాబితాలు గొండవీటిచేంతాడులవలె దీర్ఘములై యుండు నేమేమోయల్లికకథలచేనొప్పారు కాదంబర్యాదులు వంకలుదీరిన పాశ్చాత్యుల నవలలవంటివని వచించుటకు వీలులేదు, .."

ఈసాహసప్రవ్రాఁతవలన మీరే కాళిదాసబాణ భవభూత్యాదు లందఱికన్న మిన్నలమను గర్వపర్వతశృంగమునధిష్ఠించియుంట స్ఫుటమగును, పాశ్చాత్యులనవలాప్రాశస్త్యమున కట్లువ్రాసితిననితప్పి కొందురేమో, అందుకొఱకుఁ దాము బాణోచ్ఛిష్టమిదంజగత్, అని మహామహులచేఁబేర్కొనఁబడు నిర్ద్వంద్వగ్రంథము నింతగానిరసించెదరా? అనిరసించుటకూడఁ దెల్వితక్కువనే తెల్పుచున్నది, కాని తమకా విషయము రుబోధింపుటకుఁబూనినచో నెంతయేన్వ్రాయవలయునుక్కప్పెఁగానాకుసామర్థ్యమును లేదు, అయిననువినుండు,

ꠂగరుడమూర్తిరివాచ్యుత స్థితిరమణీయాఃప్రభాత వేళైవ ప్రబుద్ధసర్వలోకా,...ఉజ్జయినీనామనగరీꠂ

ఈయసాధారణ కవిత్వము నేనిందించుమీకు లోకమున నోరు లోకలెక్కయా? బాగు గర్వాభావమా బాగుఁమంచిస్థానమునలంకరించుచున్నావు, ఈరీతికవిత్వమును బాశ్చాత్యకవులుచెప్పుట కాభాషలు

తావాసఁగునవియో కావో తామువిచారింపవలసియుండఁగా సందులకు బోక యుపి లేని హేతువునఁ గాదంబరికంటె నవి యుత్తమములనియు నిట్టివియుండుటచేఁ గాదంబరి వానికిఁ దీసిపోవుననియును వ్రాయుచ్చు మీవిమర్శనాసాహసము నేమన్న ఋణముతీరును, ఓ బాణమహాకవీ! నీవు నీపుత్రసహితుఁడవై వచ్చిఁ మామిత్రులయడుగులఁగొల్చి నవలారచనములవిఱిచికొనుము, అయ్యా? మీరు మఱియొక వాక్యమును వ్రాయించియున్నారు.

"ఇంతమాత్రముచేఁ గాదంబర్యాదులనునిరసించితిననుదోషము నామీఁద నారోపింపకుందురుగాత"

ఏమివినయము? ఏమినిరపరాధిత్వము, ఏమిచంకదుడ్డుశరణార్థిత్వము? ఇంతమాత్రముచేతనే చేసినదోసఁ గూరకపోవుననుకొంటిరా? దాసునితప్పుదండముతో సరి, మీరొనర్చినయపరాధమింతటితోఁబోవునదికాదు, అదిమిమ్మును గర్వదూర్వహులను ప్రసిద్ధికి లోను జేయుట యే కాక జ్ఞానలవదుర్విదగ్ధులను సుకీర్త్తికిఁగూడ లోనుజేసికొని విడువదనియెఱుఁగఁదగు, నాబోధ మీహితమునకేయని మీరునమ్మినచో నిదిమొదలిట్టిసాహసములుడుగుటయే దానికి నికారమని మనవిచేయుచున్నాఁడను మీనవలారచన హృదయంగమముగానుండినను మీరు పీఠికలోఁబోవుపోకలు భూమ్యాకాశములనుదాఁటిపోవుచున్నవనుటకుఁ గొన్ని యుదాహరణములిచ్చియున్నాఁడను. మీకున్న భాషాజ్ఞానమో సంస్కృతమువదలుకొన్నను తెలుఁగులోనైనఁ జిన్నయ్యసూరివ్యాకరణముకూడ బాగుగఁదెలియునో లేదో యని సంశయింపవలసియున్నది. ఏమందురా? మీరీగ్రంథారంభమున.

బ్రహ్మైవరసః। రసోవైసః, శ్రుతి,
(బ్రహ్మయేరసము. రసమేబ్రహ్మ)

అని వ్రాసికొనియున్నారు. బ్రహ్మైవ, అనుటకు, బ్రహ్మేవ, అనుట అచ్చుపొరపాటనుకొందము, కాని ఆశ్రుతిలోని బ్రహ్మపదము, చతుర్ముఖవాచకమే యగునా? అయినచో మీవ్రాఁత యుక్తమే, మీకుఁ జిన్నయసూరివ్యాకరణము వచ్చినట్లే, అదిపరమాత్మవాచకమైనచో 'బ్రహ్మము, అని యుండవలయును గదా? చిన్నయ్యసూరి________చూ, అయినను నియ్యది వేదవిషయముగాన నావంటివానికి మీవంటిపండితులవలెఁ బ్రసంగించునధికారము లేదు. ఇంతవఱకేని, "ఇక్కాలమ్మున" అనియెత్తికొని "పగటివేషగాండ్రు" అని మీ రేమేమో వ్రాసినవారి గణములోఁ జేరుటకుమాత్రమే నేనీప్రసంగమును జేసియుందునని యెంచి మన్నింపుఁడు మీరు తురకసాహేబుచరిత్రలో నుదాహరించుటచే నియ్యది అల్లోపనిషత్తులోనిదని యెంచి సాహసించి నేనుస్పృశించుట అంతతప్పుగాఁ జూడరని తలఁచెదను. తుట్టతుదకుఁ దమకుఁ జిన్నయ్యసూరికూడఁ దెలియదనవలసివచ్చినను వెనుకటివలెనే యిదిగూడ నిప్పటిగర్వపర్వతులు కనిపెట్టుదురో లేదో అనివ్రాసియుందురనియే యనవలయును, అట్లుకానిచో మీపాడిమాటలను గొప్పఁజేసి విమర్శించుట కడులజ్జాకరముగదా? మఱియు మున్ను విమర్శించిన కాదంబరీ కవిత్వసమర్థన ఘట్టమునం దుదాహరించిన యింగ్లీషుభాషాసంప్రదాయజ్ఞత్వ ప్రసంగమువలనఁ దమ కింగ్లీషులోఁ గూడ ఏ.బి.సి.డీ. లకన్న నతిశయించిన ప్రజ్ఞకలదనుకొన్నను అందలిమహాకవులపేరు తలపెట్టనధికారము సుంతయు లేదనుట ధ్రువము, తుదకుఁ దామిప్పుడు ప్రకృతములుగాఁ జేసికొనిన హరాణసంస్కృతాంధ్రములుమూఁడును మిమ్ము నుద్యజింపవలసివచ్చును. ఐనచోఁ దమకు నిరంకుశపాండిత్య మెందున్నదియన? వ్రాయుచరిత్రనుబట్టి తురుష్కభాషయందుండితీరవలెను. అదిగూడఁ దజ్ఞులొప్పనిచో నికమీపాండి

త్య మెందునిల్చెడివి? నాకుఁదోఁచినదిది. పూర్వకవి శిరోమణుల నాక్షే
పించుటయందున్ను నేఁటిప్రసిద్ధకవులను నిర్భయముగా నిస్సంశయముగా
మంచినీళ్లప్రాయముగాఁ బడఁద్రిట్టుట కాదు కాదు చెడవెక్కిరించుట
యందున్ను, దక్కఁ దేనియందును బ్రవేశముసున్నయని తేలును, యు
క్తిచేతను స్థాలీపులాకన్యాయముగాఁ జేసిన స్థూలదృష్టివిమర్శనముపల
నను సర్వశూన్యత్వము సిద్ధించినను గేవల మంతతోడనే యట్లుభావిం
చుట యన్యాయముగానఁ దాము పైనుదహరించినమూఁడుభాషలును
దగుపండితులను సేవించి చదువుకొనుటకుఁ దగినస్థితిలో నున్నారనుట
కేవిధమైనసంధియమును లేదు, ఈమాటనే మీరువిశ్వసించినచో మీ
రేరిని వృథాగాఁ బరిహసించుచున్నారో వారిపాదములే మీకిందులకు
శరణములైనచోఁ దామొనర్చినవృథాధిక్కారదోష ముపశమింపఁగల
దు. మఱికొన్ని తమధిక్కారవాక్యము లుదాహరించుచున్నాఁడను.

"ఘనత్వము హెచ్చినకొలఁది వినయాదిసద్గుణము లతిశయింపవలెనుగదా? ఈ
కాలమునం దొకరినొకరు తిట్టుకొనుటయే కవిత్వమైనది"

ఈవాక్య మింతకు మున్ను విమర్శించిన వాక్యశేషమే, ఘను
లకు వినయముండవలెను. అనుమాట కెంతవిలువయేని యీవచ్చును.
ముందు తమకే యీవాక్యము బాధించుచున్నది. మీరుఘనులుకా
రా? నాయుద్దేశముంబట్టి మీరు నిశ్చయముగా ఘనులే కాని వినయ
ము మీవాక్యరచనంబట్టిచూడ మీయందుఁ బూజ్యమని చెప్పెదను.
నేఁటికవులను సర్వసామాన్యముగాఁ గాకున్నను గొందఱను వారిపే
ళ్లుపెట్టకున్నను బిరుదనామములనేని ప్రత్యక్షరమును లిఖించి వెక్కిరి
గుట, మిట్టిపడుట, లోనగు సాహసోక్తులతోఁ బ్రసంగించు మీకే విన
యమున్నట్లు ప్రాజ్ఞలోకము విశ్వసించుచో "వింధ్యఃప్లవేత్సాగరే"
స్వయంతరితుమక్షమః కథమన్యాపరాంస్తారయేత్॥ కావునఁ దమవ్రా

తనే తాము మఱికొన్ని సారులు చదివికొని వినయవంతులరై యప్పు డు లోకుల నాక్షేపింపఁబూనుట యుక్తము. లేనిచోఁ గురిగింజ సామెత ప్రత్యక్షముకాకతీరదు. మఱియు నీకాలమునం దొకరి నొకరు తిట్టుకొనుటయే కవిత్వమైనది. అని వ్రాసితిరి. సరియే పగటివేషగాండ్రు, లోనగు పదములతో మీరొనర్చినప్రసంగము కతిపయకవ్యధిక్షేపమే కదా? అయినచో నాయీ మీవచనరచన కవిత్వమేయగునా? లేదా? కాదందురో! అనకేమి,

"కుందమందారబృందారక దంతావళమందాకినీ చందనముక్తాహార చంద్రకోటీరపాటీరశారదా శారదాంభోజకాశనీకాశ యశఃప్రకాశా" అను భావదారిద్ర్యముగల దీర్ఘ గద్యములందును గవితలేదనుట నిర్వివాదాంశము,

అనివ్రాసినమీకు మీవిద్యేదైనను ఆధునికకవితచక్రవర్తినిం దామాత్రప్రయోజనములగు పొడిపొడివదరులయందుఁ గవిత్వముం డునని తోఁచెడినఁటకాని, స్వవిషయమగుటచే నభిమాన మెంతటివినిగర్వచూడామణులకును నుండితీరవలసియుండునుగాన నీపొడిమాటలు తడిమాటలై సరసములై కవితాస్పదము లగునేమోయని తలఁచెదను ఎట్లైని మీరచన కవితయగుటయు మీ రీకాలమున్నన మహాకవులగుటయు మీరు నిగర్వచూడామణులగుటయు మీతూలుప్రసంగము కొంటి వి పెట్టి తలగోకికొనుటవంటిదికామండుటయును మదపేక్ష్యము లేయగుటచే నేనందులకుఁ బ్రతిబంధకుఁడనుగానుగాని మీవిషయమునఁ దుద నుదాహరించినయంశములనుసాధింప లేనినన్నుమాత్రము క్షమించవలెను. ఇతరులెవ్వరేని నేనుసాధింపనేరనిగుణములను దమవ్రాఁతను బట్టి తమయందుసాధింతురేమో, అప్పుడు నేనునాతప్పునొప్పికొని వారికి నానమస్కృతులు కావుకావు దండముల నర్పించుకొందును. అట్లుసాధించులోపలమాత్రముదాము వినయవంతులుగమాత్ర ముండుటకుఁ బ్రార్థితులు.

అతిశ్లేష్మామ్నాయములైనవి, భారతామ్నాయముతోఁదుల్యములఁట? మూర్ఖులు వానినే యాసక్తితోఁ బఠించుచున్నారు.

ఇది పైవాక్యశేషము. మీరనుకొన్న తిట్లకామ్నాయత్వసిద్ధి గలుగుట కేమిహేతువో మీరెఱుఁగరా? అందు సిరి విశేషించియుండుటచేతనని యిప్పుడేని దెలిసికొనియెదరా? తెలిసికోనిచోఁ దెల్పుదుకుగాక, ఇఁకమీతిట్లకో ఆమ్నాయత్వసిద్ధికలుగుట దుర్లభము. ఎందుచేత, వృథగాదూషింపమొదలిడుటచేత, ఇందులకు జగమే సాక్షియగుఁగాక, ఆయామ్నాయములనుబఠించువారు మూర్ఖులనుచున్నారు. ఐనచోఁ నా మాయామ్నాయముల నెన్నఁడుగాని పఠించియుండరు. పఠించినచో మూర్ఖత్వమున కవకాశమిచ్చినవారగుదురుకదా? కావునఁ బరిశేషన్యాయముచే నేఁటికాలమున మూర్ఖులుకానివారుతమరొక్కరేయని వ్రాయుచున్నాఁడను. కాదు మఱికొందఱునాతోనున్నారిందురా? అనరు, ఈక్రిందివాక్యము బాధించును.

అక్కటా! జనులయజ్ఞానమును, గవితాదుర్దశయు నింతకన్న హెచ్చఁగలవా?

దీనింబట్టిచూడ జనులందఱును నాయామ్నాయపరనమొనర్చుచున్నట్లును మీరు పైనుండి భగవంతునివలెఁజూచి వారిదుర్దశకువిచారించుచుఁ గవిత్వమునుద్ధరించుటయెట్లురా భగవంతుఁడా! యనియెంచియెంచి తుదకీసుల్తానురచనకుఁబూనినట్లును నెట్టిమూర్ఖునకేని విస్పష్టపడును. ఇది నిగర్విత్వసూచకప్రసంగములలో నొకటిగాఁ బ్రాజ్ఞులు జమకట్టికొందురుగాక. ఇంకనీప్రసంగమునువదలి,

"ఉత్తమకవులందఱును నిష్కళంకమైనప్రవర్తనగల్గి సంపూర్ణమైన వివేకము గలమనుజులుగానుండిరి వారిజీవితములను బరీక్షించినచో"

అనువాక్యమును విమర్శింతము. (1) కాళిదాసు, (2) పండితరాయలు, (3) శ్రీనాథుఁడు, (4) ధూర్జటి, వీరుత్తములా? అధములా?

వీరిజీవితములను దామపరీక్షించితిరా? పరీక్షింపలేదుకాఁబోలును, మీచేతికడ్డేమి? వీరినే యధమకవులని వ్రాయగలరు. బాణునికన్న వీరి లెక్కయేమికాని కాళిదాసుని మీరే మంచివాఁడనివ్రాసియుంటచే నింతలోనే యధమకవియనివ్రాయరేమోఅని నేననుకొందునుకాని మీవ్రాతధోరణినిబట్టి మీరేమివ్రాసినను వ్రాయఁగలుగుదురని మానమ్మకము.

శ్లో॥ "త్రిలోకేవిజయీభవేత్" నాకుఁదోఁచినదిచిత్తగింపుఁడు. కవిత్వమునకును జరిత్రమునకును సంబంధ మొక్కొక్కచోలగించినను నదిసర్వత్ర సంఘటింపదు. సంఘటించుటకన్న సంఘటింపకుండుటయే తఱుచుగఁజరిత్రలవలనదేలుచున్నది. ఉత్తమమధ్యమాధమత్వములు చరిత్రవలనఁ గవులకు నేలాక్షుణికులును నిర్వచించినట్లువినము. ఇట్టి నిర్ణయము సర్వసాధారణమగుటచేఁ గవినిష్ఠమగు నుత్తమాధమత్వములు కవిత్వమువలన ననఁగా ధారాశుద్ధ్యాదులవలన నెఱుఁగవలసినదియేకాని యతనిచరిత్రవలనఁగాని యతఁడువ్రాయుచరిత్రలవలనఁగాని యెఱుఁగఁబూనుట యనాలోచనపని. అట్లెవ్వరును ప్రాజ్ఞులనఁగావినలేదుకాని యిప్పుడిప్పుడు కొందఱీపొడిమాటలను వ్రాయమొదలిడిరి. ఇదినిరాధారము ఉభయసామానాధికరణ్యముండినయెడల నభ్యుచ్ఛయమేలేనిచోఁ గేవల చరిత్రపారిశుద్ధత్వమువలనఁ బ్రతిమనుజుడును గవికాఁడుగావునఁ గవి కావశ్యకము కవితాశక్తియుఁ బాండితియు లోనగునవియేయని ఘంటాపరముగాఁజెప్పుచున్నాఁడను. కవికిఁగావలసినసామగ్రియిది,

శ్లో॥ శక్తిర్నిపుణతా లోకశాస్త్రకావ్యాద్యవేక్షణాత్
కావ్యజ్ఞశిక్షయాభ్యాస ఇతిహేతుస్తదుర్భవే॥

శ్లో॥ నపశబ్దో నతద్వాచ్యం నసావిద్యా నసాకలా
జాయతేయన్న కావ్యాంగ మహోభారో గురుఃకవేః॥

ఆయీశ్లోకములు శ్రీ కాంతకవిగారికి రానివికావు. ఇందుఁగవికిఁ గావలసినసామగ్రిలోఁ జరిత్రపారిశుద్ధ్యము చేర్పఁడలేదు. ఇప్పుడుచేర్పవచ్చునందురా? అయినచో నింతకుమున్న దహరించిన కాళిదాసులోనగువారు కవితాదూరులుకావలసివచ్చును. అయినచో మనకుఁగవులెవ్వరు? పూర్వులలోఁగూడ మనకాంతకవిగారివంటి నిష్కళంకచరిత్రగలవారురు నేటికాలమునకు శ్రీకాంతకవిగారును మఱికొందరు వీరివంటిసత్పురుషులును నని శ్రీరావుగారివ్రాఁతవలన మనమునిర్ణయింపవలసివచ్చును. అయినచోఁదప్పేమి? తప్పేమియు లేదుకాని కవితాతత్త్వవేత్త లీశ్లోకమునుబరింతురేమో,

శ్లో॥ గతేభీమే గతేసోమే గతేసర్వత్ర తావపి, అహాహా పేరూరి దార్భాగ్యం వ్యాఖ్యాతాసూపశంకరః

ఈవిషయ మింతటితోముగించి మామిత్రుల మృదువాక్యపూరితములగు మఱికొన్ని ప్రసంగములను దిఙ్మాత్ర ముదాహరించుచున్నాడను.

“అపానవాయువు వెడలునప్పుడు పుఱ్ఱుమని ధ్వనియగును మూత్రము వదలినచో జలజలపాఱును. మల విసర్జనసమయమున నేదో యొకస్థానము విస్మృతమగుచు”

ఈప్రసంగము వీరుకవి శృంగారరసము నధికముగా వర్ణింపఁగూడదనియు నది స్వభావోక్తిగాన వర్ణించుట తగునని చెప్పువారి ప్రసంగమాదరణీయముకాదనియు నైనచో నిప్పుడుదాహరించినవిషయములు గూడ వర్ణ్యములే కావలసివచ్చుననియు నాపత్తిగావ్రాసిరిఁ కాని దురుద్దేశముతో వ్రాసినవారుకారు. ఈయుపపత్తి సరియైనదా? కాదా? అనునది విచారణాంతరము, రావుగారికిఁ గల విజ్ఞత్వము నీప్రసంగము

వలననే ప్రాజ్ఞులు దెలిసికోవచ్చును. దీనింగూర్చి వారు కోరినచో మ రియొకప్పుడు వ్రాయఁదలఁచి గ్రంథవిస్తరభీతిచే నుపరమింపనెంచు చు నింకొకటి వీరిజ్ఞానమును దెలుపు సందర్భము నుదాహరించు చున్నాడను.

క॥ అచ్చనబుచ్చనలందును నచ్చన్నే మంచిమనుజుఁడది యెటననఁగా
నచ్చన్న బొచ్చుపీఁకెను బుచ్చన్న బొచ్చంతపట్టి పుటపుటపీఁకెన్॥

అని వీరొకపద్యము నెవరిదో దెచ్చి యుదాహరించిరి. అక్కడి సందర్భమును బట్టి చూడఁగా నింతపాడుపద్యము నుదాహరింపఁదగి లేదు. చూడుఁడు.

"గణితము, వైద్యము, జ్యోతిషము, వ్యాకరణము, మొదలగు శాస్త్రములు మ నవారు ఛందోబద్ధములు గరచించిరి వీనియందుకు.. కవితలేదనుట నిర్వివాదాంశము"

పైపద్యము బొట్టుపెట్టినస్థలమునందు గ్రంథకర్తగా రుదాహ రించిరి. వీరితాత్పర్యమేమి, కవిత్వమనునది ఛందోబద్ధమైన దానియం దెల్ల నుండదు. అట్లుగాకున్నచో ఛందోబద్ధమున శాస్త్రరచనలుకూడ గవిత్వముకావలసివచ్చుననియు నీరసరచనలుగల వాడిఁ గవిత్వములు కావలసివచ్చుననియుం గదా? ఇందుల కొప్పితిరేని పరమపవిత్రములై న శాస్త్రములనుగూర్చి వ్రాయుచు నీ"బొచ్చుపీఁకు" ప్రసంగమును జేయుట యెంతఘనతను దెల్పునో చదువరులే తెలిసికొందురుగాక. వీ రియుద్దేశము తేలినది. వీరేదియో వంకంబట్టి సంస్కృతపంతులను ఇం గ్లీషువిద్యాధికులను నిందించుటకుఁ గంకణముగట్టుకొన్నట్లు కొన్ని యాధారములు గానవచ్చుచున్నవి. కావున నాయూయీశాస్త్రముల నుగూడఁ దిట్టినవారగుటకుఁగా నీపరమనీచపుఁ బద్యమునకుఁ దత్పంక్తి ని వీరాసనగూర్చి గౌరవించిరి. వీరియుద్దేశమును వ్యక్తపఱుచు పంక్తు లుదాహరించు చున్నాఁడను.

"పూర్వమింగ్లాండుదేశమునందువలెనే మనదేశమందు నిప్పుడు నవలలకుఁ బండితగౌరవమంతగాఁ గానరాదు తెలుఁగన్నను దెలుఁగు పుస్తకములన్నను దెలుఁగు గ్రంథకర్తలన్నను దృణముకంటెఁ దేలికగఁజూచు కేవల సంస్కృతపండితులును గేవలాంగ్లభాషాపండితులును మనతెనుఁగు నవలలను నిరసించుట యబ్బురముకాదుగదా! మాతృభాష నభిజ్ఞులైన యీమూర్ఖుల యజ్ఞానమునకు జాలినొంది వీరిని క్షమింతమను కొనుఁడు.

ఓ సంస్కృతభాషాపండిత శిరోమణులారా? ఓయాంగ్లేయభాషైక నిష్ఠాగరిష్ఠులారా? మాకాంతముగారి నవలాగ్రంథము మీరందఱును శిరమున ధరింపుఁడు. లేనిచో వీరు మిమ్మును మూర్ఖులని చెప్పిగాని క్షమింపరు. ఈకర్మము తెలుగుదేశములోని వారికేకాని యితరులకు లేదు గాన తెలుఁగువారందఱును నొక్కొక్కపుస్తకమును గొని ప్రొద్దుట దానికి నమస్కరించి యీమూర్ఖత్వపిశాచము నాతఁబడక తొలఁగుండు. ఔరా సాహసము ఎంతమాట నోటికివచ్చిన నంతమాటయును నుపయోగించెదరుగా, మిత్రమా? ఈవ్రాఁత నిగర్వత్వమునకు లక్షణమో లేక సజ్జనత్వమునకులక్షణమో తెల్పుము. సహోదరా? ఇట్టిదుడుకువ్రాఁత వ్రాయు నీవెవరినిగాని జన్మమధ్యమున సహేతుకముగనైన నాక్షేపింపవుగదా? అట్లొట్టుపెట్టుకొనుము. ఇదియేమి చిన్నతనము. బాల్యముచుండి సంస్కృతము చదివికొని సర్వదా దాని లోతుమునిఁగి తేలు సంస్కృతభాషాకోవిదులకుఁగాని యల్లే యమ్ ఏ, వఱకో అంతకించుకతక్కువగనో రాజకీయభాషనభ్యసించిన హూణభాషావిద్వాంసులకుఁగాని మన మాతృభాషాపరిచయ మలవడకపోవచ్చును. తావన్మాత్రమున వారుమూర్ఖులగుటయు మనబోట్లుక్షమించుటయుఁగూడనా? ఔరా? నిగర్వత్వము. అపురాజ్ఞానబోధ? ఈతెలుఁగునందాదరముచూపనిమాత్రముననే యింతదూషించునెడలఁ గాలాను

సరణమునుబట్టి సంధ్యావందనమునుమానిన బ్రాహ్మణులు రాజకీయోద్యోగులలో ననేకులుండవచ్చును. వారినెవరేని యిట్లుదూషించిరా, దూషింతురుగాక, అదియింతకన్న సహేతుకము, ఇదియట్టిదికాదు. వచ్చుఁగాక మానుఁగాక, తెలుఁగులోనాదర మాననియంతనే దూష్యుఁడగునా? చిత్రమా? యేలయుత్తర మొసఁగకుంటివి. ఇట్టిభవత్ప్రసంగమునువిమర్శించినందులకు నన్నుమన్నింపవేఁడెదను. నామాటవినవచ్చినదా? ఇంకనుమీరు పెక్కు లనుచితములనువ్రాసియున్నారు. అవిమఱికొన్ని పుటలలోఁగలవు. ప్రత్యక్షరమును ననుచితముగనేకన్పట్టుటచేనిఁకగ్రంథము పెంచి పత్రికలకుఁబనిగల్పింపనెంచక విరమించుచున్నాఁడను. మీరుశృంగారమునుగూర్చిచేసిన పరిష్కారముగాని శేషమునొకటపతిని నిరసించిననిరసనముగాని లవమునునిల్వదు. మీరిద్దానిపైఁదగునుత్తరమునువ్రాసినపిమ్మట దానింగూర్చివ్రాయనెంచితిని. ఈయుపోద్ఘాతముఁద్రోసివేసినచో మీనవల చక్కఁగనేయుండునని నమ్మెదను. నేనిప్పటికిఁగథాభాగముచూడనేలేదు చూడకున్నను మీకీమాత్రపుఁబ్రజ్ఞలేకపోలేదు. పెద్దకుండలకెసళ్లుమానవలెను, మానవలెను, మానవలెను, ఇదినామొనర్చుహితబోధ, మీరెంతటిప్పాసుల్తానుకవులైనను అతనిప్రవర్తనమును మీవాగ్రచనలోసర్వత్రస్ఫురింపనీగూడదు. తప్పు, తప్పు, తప్పు, నన్నుమన్నింపుఁడు, క్షమింపుఁడు, బుద్ధిగలుగుఁడు.

ఇట్లు మీహితుఁడు

త్రి. రామస్వామి.



ఉలిగుండం రంగారావుగారిచే వ్రాయబడినది

# ఆంధ్ర భాష

నే వ్రాయఁబూనిన విషయ మాంధ్రులకందఱకు మనోరంజకం బగుఁ గాక, సంఘసంస్కరణలతోఁ బాటు భాషాసంస్కరణమును నేఁటి కాంధ్రప్రపంచంబున నడుగు వెట్టినదిగతంబయి కొన్ని చోట్ల నార్భటించుఁ గొన్ని చోట్ల నాదరింపుఁడటంచుఁ బ్రార్థించుచున్నది. ఆయా ప్రార్థనలఁ బాటింపనగునో కాదో విద్యావిశారదులగు వారలకందఱకుఁ దెలిసినవిషయమే. భాషాసంస్కర్తలు ప్రస్తుతము గ్రామ్యము లేక వ్యావహారిక భాష లేక నాగరికాంధ్రము నే గ్రంథములందు వాడవలయుననియభిప్రాయపడుచున్నారు ఆంధ్రులకేమి తదితరులకేమి గ్రామ్యము క్రొత్తదికాదు ప్రతిదేశమందును ప్రతికాలమందును ప్రతిజాతివారియందును గ్రామ్యముండకమానదు గ్రామ్యమును గ్రాంథిక భాషయును విలక్షణములైనఁ వియ. అట్లయ్యు నే భాషయందేనియు విద్వాంసులనంబరఁగు వారద్దాని నంగీకరింపక దానికంటె నుత్తమమై నిశ్చలమై రసపూరితంబై శ్రవణానందకరంబైన భాషనే గ్రంథములఁ బ్రయోగించుచువచ్చిరి, మఱియు నిప్పటికిని బ్రయోగించుచున్నారు. దీనికిఁ గారణమేమైయుండును? కారణము సమస్తజనులకువిశదమె గ్రామ్యమనునది దేశదేశమునను, మండల మండలంబునను, గ్రామగ్రామంబునను బలుతెఱంగుల మారుచున్నదికాని సారూప్యమునువహించి యుండదయ్యె, అందునను బ్రాహ్మణులు మాటలాడునదియుఁ దదితరులు మాటలాడునదియు నొక్కరూపముననుండదు. రాజమహేంద్రప్రాంతముల నావకాయపైచర్మమునకు "తొక్కయ్యనా?" "లోపలిగింజకు" డొక్కయ్యనా? యందురు. గుంటూరుసీమను "తోలు," 'టెంక" యందురు అట్లె

"భోగట్టా" "పాలగుండ," "అన్నవుగుండ", 'ఎలక,' 'తెలకపిండి,' 'నూసి,' 'తోంగున్నాను' అన్న మాదేశమువారి కేమియర్థమగును? 'ఎలక'యనుటకు "ఎలుక," 'ఎలిక' యనియు, 'తెలకపిండి, యనుటకు 'తెలికెపిండి' 'నూని' కి 'నూనె' యనియు నీసీమనువాడుదురు 'బుజ్జకొట్టించుకోండి', 'బుజ్జగికించుకోండి', 'డొక్కచీర్తాను,' 'మమ్ములువిఱగకొడ్తాను అన్న నన్ని సీమలవారికర్థమగునా? బళ్ళారిసీమనుసొమ్ములన్నఁ బశువులు. ఇట్లొక సీమమాట మఱియొకసీమకుఁ దెలియకున్నది

మఱియు నాగరులు మాటలాడుభాషనుపయోగింపవలయునని సంస్కరణాభిమానులయాశయము. నాగరులభాషయు నొక్క తీరున నుండదాయె మఱియు నాగరులన్న నుత్తమజాతివారని వారియభిప్రాయము. ఉత్తమజాతివారిభాష యేలగ్రాహ్యమో నీచజాతులవారిదేల యగ్రాహ్యమో సంస్కర్తలు చెప్పరైరి. సంఖ్యకన్ననో రెండవతరగతి వారేహెచ్చు. కాన "బహుజనులువాడుభాష కాన" ననుహేతువు సంస్కర్తలకు సహాయకారి కాదు. పోనిండు ఉత్తమజాతివారిభాష యెక్కువమృదువనియా, రసవంతమనియా, నిర్దుష్టమనియా? అట్లయిన నీవిషయములందెల్ల గ్రాంథికభాష గ్రామ్యముకంటె మేలనక తీరదుగదా కాన నీకారణమును వారికిసరిపడదు మఱియు నుత్తమనీచజాతి నిర్ణాయకులెవ్వారు. ఎవరినినీచులని భావించుచున్నారో వారేయెచ్చుగనున్నారు. వారు తమ కేయుత్తములమందురుగదా! కానిచో వీరుత్తములు వీరుకారని ప్రభువులొక చట్టమునిర్మింపవలయును.

పూర్వకాలమందున నిట్టిగ్రామ్యభాష లేకయుండెనా! ఆకాలములందు జనులు సామాన్యముగ మాటలాడు భాషలోనే నన్నయాదులు గ్రంథములువ్రాసిరనియు, నేఁటికి సామాన్యజనభాష మాఱిన

దిగాన గ్రంథభాషయు మాఱవలయునని సంస్కరణాభిమానులందురేని అది నిరాదరణీయము. నన్నయాదులెవ్వరును వ్యావహారికభాషలో గ్రంథరచనం గావించియుండలేదు. అప్పటికిని గ్రాంథికభాష వేఱు. వ్యావహారికభాష వేఱు. ఇందుకుఁ బ్రమాణము అథర్వణవ్యాకరణ కారికావళిలో "పామరాదిప్రయుక్తం యత్తద్గ్రామ్యమభిధీయతే" యనియు, నన్నయభట్టీయమందు 'అనియమమార్గ్గా గ్రామ్యం హీయత్త్వాపభ్రంశః॥ విరళాపేచోపాదికశబ్దా ప్రవ్యాహారస్తు శబ్దజ్ఞా॥ ఇహాతు ప్రవ్యాహారోక్త్యంసజ్ఞేతి తసుప్రసిద్ధమేవపదం "అనియు, నాంధ్రభాషాభూషణ మందు" గ్రామ్యభాష నాఁగఁ గల వైదు తెనుఁగులు..." అనియు "......నందులోన గ్రామ్యమొందు నెవ్వరునొప్ప రొరులఁ దెగడుచోటనొప్పున దియు" చెప్పుమఱియుఁ బామరులభాష గ్రామ్యమనియుఁ దానిఁ బ్రయోగించుట కావ్యదోషమని వరసభూపాలీయములో నాల్గవయాశ్వాసమందు చెప్పఁబడియున్నది. మఱియుఁ గణ్వుడుఁ "అశాస్త్రీయప్రయోగో గ్రామ్యః" అని చెప్పినాడు. కాననన్నయాదులు వ్యావహారికభాషలో గ్రంథముల వ్రాసిరనుట కేవలముకల్ల. ఇట్లార్యసమ్మతముగాక దేశదేశములకు వేసంబులమార్చిచరించు పుంశ్చలియగు గ్రామ్యమునుబుద్ధిమంతులంగీకరింతురా?

II భాషాప్రయోజనమేమనఁ గృతికర్త యభిప్రాయములఁ జదువువారలకుసులభముగబోధించి తద్ద్వారావారలకు జ్ఞానముకలిగింపవలయునని యందురు. ఇదియథార్థము. అయినగ్రాంథికభాషవలననీప్రయోజనము కూడకయున్నదా? కూడుటలేదనుటపొరపాటు. పూర్వమందు స్త్రీలేమి, విద్యమాకుఁబుట్టుకతోవచ్చినదను బ్రాహ్మణులకంటె నితరులేమి యనేకగ్రంథములఁ జదివి జ్ఞానసంపన్నులై గురుత్వమంది ప్రతిష్ఠ

గాంచిన వారల నేకులుగలరు. ఇప్పుడునట్టివార నేకులుగలరు. వారుచది విన గ్రంథములువ్యావహారిక భాషలోనుండెనా? లేదు లేదు. బ్రాహ్మణేతరులుకొందఱెంతమంచిగ్రంథముల నెంతమంచి శైలిలో వ్రాసియున్నారో విచారింపుడు. గ్రాంథిక భాషలో వ్రాసినగ్రంథము లెవ్వరికినిఁ దెలియక యినుపపెట్టెలఁబోలియుండినచో నప్పుడప్పుడే యవి నశించి యుండును. అట్లుకాక వేలకొలది సంవత్సరముల క్రింద వ్రాయఁబడిన గ్రంథములిప్పటికిని మాన్యతఁబొరయుట యాలోచింపసంస్కర్తలవాక్కులు పొల్లులు కాక మానవు.

నాటకములన్నియు గ్రాంథిక భాషలో వ్రాయంబడి ప్రదర్శింపబడుచుండుట తెలియనివిషయముకాదు వానియర్థముగ్రహించి పామరులుసయితము సంతసించుట లేదా? తెలియకసంతసించిరనుటతప్పు. అట్టిసంతసము చిరకాలముండ నేరదు. అయినఁబ్రతిపదమునకర్థము గ్రహించుచున్నారాయని యందురు గ్రామ్యభాషలోవ్రాసిన వ్రాతలు మాత్రము ముక్కుముక్కయర్థమగునా? అదియుఁగల్ల

స్త్రీలును బ్రాహ్మణేతరులును పాడుకొనుకీర్తనలు, తత్వములు, యక్షగానములనేకములుకలవు అందేవియు గ్రామ్యమునరచింపఁబడియుండకున్నను పాఠకులువానిఁజదివి యర్థముగ్రహించి యనుభవమునకుఁదెచ్చికొని సంతోషమనుభవించుచున్నారుగదా! వారలుభారత భాగవత రామాయణములుచదివి తదర్థంబుల గ్రహించుటలేదా?

సంస్కృతనాటకములం దుత్తమపాత్రలు సంస్కృతముఁబల్కునను దానియర్థంబు విపులంబుచేయుచుకొనకయే నీచపాత్రలు ప్రాకృతంబునఁబల్కుదురు. నీచపాత్రలిందువలన సంస్కృతము తెలియకయే ప్రత్యుత్తరింతురనుటసమంజసమా? కాదు. దీనివలనను నీచులకు

# ఉపోద్ఘాతము.

శ్లో॥ ప్రీతిర్నామ సదస్యానాం ప్రియా రంగోపజీవినాం
జిత్వా తదపహ ర్తారమేష ప్రత్యాహరామి తాం॥౧॥
శ్లో॥ యశోవా మృత్యు ర్వాయుధి భుజభృతాం కః పరిభవః॥
(ఇతి మురారి ర్మహాకవిః)

చదువరులారా? సూరివరులకును శూరవరులకును సదస్యప్రీతి మూలకమగు యశమను ధనము సర్వదా తస్కరాది బాధలనుండి కాపాడుకొనుట యావశ్యమయినపనులలో మొట్టమొదటిది. యశోధనము నపహరింపవలయునని యనేకులు పుణ్యాజన సదృశులగు తస్కర మహాశయులు సర్వదాయత్నించుచునే యుందురు. సంపన్నగృహస్థులు తమతమగృహాదికమువలెనే వీరలనుండి మనమిద్దానిని గాపాడుకొనుచునే యుండవలయును. ఏమఱజనదు. అందులకే గుంటూరిసీమ అను మహాగ్రంధము బయలుదేరియున్నది. అందనేకాంశములు విపులముగాఁ జర్చింపఁబడియున్నవి. ఈతస్కరులకుఁ గొందఱు గురువులుందురు. వారివలన నవ్వారిప్రయత్నములు కొంతదనుకఁ గొనసాగుచుండును. ఆగురువులు పైకిఁ బెద్దమనుష్యులుగా నటించుచుండుటయుఁ బనివచ్చినప్పుడు పట్టుపడుచుంటయు లోకవిదితమే, అస్మత్కీర్తి తస్కరుల కట్టి గురువులు కొందఱేర్పడిరి. ఈగురువులకారణముననే "ప్రత్తిపాటి" వ్యాసమను నసత్యపుముద్ద నాంధ్రపత్రిక ప్రకటింపఁగలిగినది.

ఆవ్యాసమువలనఁ బెద్దకలవరము గుంటూరిసీమయందే కాక యితరసీమలయందుఁ గూడ జనించినది. దానిమీఁద శ్రీ ఆంధ్రపత్రికా ప్రధానులకుఁ దమతమ యాశయములనుదెల్పుచుఁ బొరఁబడిన యంశమును సూచించుచు బలువు రుత్తరములు వ్రాసిరి. ఆయన నిషధ

యోగ్యులుగానఁ గల నిజమును వారివారికి బుజాహృదయముతో వ్రాయుచు వచ్చిరి. ఆవ్రాయుటనుబట్టిచూడ నీగురువులవారికి వారివల్లఁ బూర్ణమైన మందలింపు సంప్రాప్తమైనట్లు తేలుచున్నది. దానిమీఁదఁ దమమిత్రులపేరఁ గొన్నియుత్తరములు తోఁచినట్లెల్ల వ్రాయుచు వచ్చిరి. ఒకనాఁటి సమయమున శ్రీ ముట్నూరి కృష్ణారావుగారును మాయిరువురలో నొకరును గలిసి మాటలాడుట తటస్థించినది. అప్పుడొక నూఱుపద్యములు, సత్యమును దెల్పుటకుఁగా "ముట్నూరి కృష్ణారాయావచియింపుమయ్య ...ఎట్టిదో" అను మకుటముతో రచింపఁబడి వినిపింపఁబడినవి. ఆధారమెట్టులుండునో అవియేతీరున రచింపఁబడినవో యెంతకాల మందులకుఁ బట్టినదో అను నంశములను గొంతకాలమువఱకును శ్రీ కృష్ణారావుగారివలననే వినవలయును. తీరికకొలఁది నచ్చియినప్పుడు పద్యములే తత్తదంశములను దెల్పఁగలవు. దైవఘటనా వైచిత్ర్యమిదమిత్థమని నిర్ణయింప నేరికిని శక్యముగాదుగదా? యశఃకాములై సగౌరవముగా సప్రయత్నముగా నాహ్వానమొనర్చి బ్రహ్మరథము పట్టి సంతోషపెట్టి కంకణాదుల నిడినవారు బ్ర॥ శ్రీ॥ భాగి చెన్నయ్యగారు లోనగువారు వారిసభలోఁ జెప్పినవి యేఁబదికన్న లేవు. తక్కిన ప్రాస్తావికములతోఁ గూడ 75 పద్యములుండునేమో అందుఁబదిపద్దెములేనివారికిఁ బూర్తిగా సంబంధించినవి లేవని యీయవధాన పుస్తకమె తెల్పునుగదా? అట్టులుండఁగా శ్రీ కృష్ణారావుగారిమీఁద నూఱుపద్యములు చెప్పుటకేమి హేతువో? శ్లో॥ కష్టా వేధవ్యథా కష్టో నిత్యం చ వహనక్లమః, శ్రవణానామలంకారః కపోలస్యతుకుండలం॥ (మురారి) వీరా చెన్నయాదులు చేసిన పరిశ్రమలో నెన్నవవంతు పరిశ్రమయుఁ జేయలేదు. కోర

ను లేదు. పైఁగా "అయ్యయ్యో? వృథాగ నామీఁద నెందులకియ్యవి" యని కూడఁ జాల మోమోటముగాఁ బ్రసంగించిరి. ఐనను వీరిమీఁద నా యీపద్యములు శాశ్వతబ్రహ్మకల్పముగా నిలువఁదగిన ధారతో నేల రచింపవలెను? కారణములేని కార్యముండదు కారణము గాన రాసిచో నది జన్మాంతరపుణ్యముపైఁ ద్రోసివేయుట పెద్దలధర్మము కావున "పుణ్యైర్యశోలభ్యతే" అను నార్యోక్తి శ్రీకృష్ణునికి సంబంధించినదేయగుటచేఁ గొంతవఱ కాయుక్తినే మనకృష్ణరావుగారియెడల వినియోగింతము. ఈకవి యీపద్యములు చెప్పుటకుఁ గారణమును లోకులెట్లును నిర్ణయించకమానరు కొందఱు వారికిని వీరికిని వైదికత్వసంబంధమున్నది యని యందురు. అది నిల్వదు వైదికు లనేకులుండ వీరిమీఁదనే చెప్పుటకుఁ గారణ మన్యముండవలయును. అదిగాక కృష్ణారావుగారు వైదికులైనను బ్రహ్మసామాజికులుగదా? అయినచో హేత్వంతరము కావలెను అది వెల్నాటిత్వమనునెడల రచించిన కవి ఆరామద్రావిడుఁడు, అట్లుని యర్థార్థి సంబంధముండవలెను ఇంతవఱకు నీయుభయులకును నట్టిదిలేదు అయినచో శ్రోతుత్వమేని యుండవలెను. అదిలవమును లేదు. అందులకు 191౮ సం॥ 1వ ఫిబ్రవరి కృష్ణాపత్రికయేసాక్షి. అట్టిసుగుణవత్తకావలెను. ఈహేతువు కొంతవఱకు నొప్పదగినదైనను అట్టిగుణగణ్యులు బందరులో ననేకులు గల్గుటచే నిదియును దుదనెగ్గదు. ఇట్లింతవఱకెవి జర్చింపవచ్చును గాని యివి కేవల శుష్కతర్కము, ఈకృష్ణారావుగారు సంపాదించుకొనిన మిత్రసత్త్వము లే వీరి కీయపూర్వమయిన కృతినాథత్వమును గల్గించిరనుట యొక్కటియే తుట్టతుదకు నిలువఁదగినది. ఆమిత్రసత్త్వము లెవరో పేర్కొనవలసిన యావశ్యకత మామీఁదఁ బూర్తిగానున్నను మాకృతినాయకు

లు శ్రీ కృష్ణారావుగా రేలోకో యవ్వారినామాములను భద్రపఱచ నెంచుచున్నారు. కావున మేమును వారియభిప్రాయమును మీాఱఁజాలము. శ్రీరావుగారి యాశ్రిత వాత్సల్యము కడువర్ణనీయము. వలయు వా రాపవిత్రనామవర్ణములను శ్రీ నాగేశ పండిత దండనాధికార గ్రంథమునుగాని వేఱొక పురుషోత్తముని పాదధూళినిగాని ప్రశ్నించి తెలిసికొనఁగోరెదము. ఇంకను దెలుపఁ దగినసామగ్రి విస్తరించియున్నను నయ్యది యిటఁబ్రసంగించుట యంత ప్రస్తుతమును అంత సర్వామునుగాదని యెంచి విరమింపఁబడియె, ఈమిత్రసత్తము లిటీవల నొక యుత్తరమును బ్రకటనార్థమై కృష్ణకుఁబంపిరఁట. అయ్యది సత్య నిర్ధారణార్థము మేము కృష్ణరాయోద్దిష్టముగఁ బ్రచురించిన వ్యాసము నీక్షించుటవలనఁ గలిగిన యావేశముచేతనో, లేక తమప్రకృత యజమానులవలనఁ గల్గినమందలింపువలనియావేశముచేతనో వ్రాయఁబడినట్లు దానిశైలి చెప్పుచున్నది అది ప్రకటితమయినచో నవ్వారల సద్ధృదయము పూర్తిగా మేముగాని కృష్ణరావుగారుగాని చెప్పకయే తెలిపోవును గాని శ్రీ రావుగా రవ్వారల వ్రాఁత కొత్తో వగచుచు "బుట్టదాఖ"లొనర్చిరఁట? ఈబుట్టదాఖలొనర్చుట సత్య నిర్ధారణముగూర్చి పూర్తిగా బాధకమగుచున్నను యోగ్యతాపాదకమగుటచే మేము వేనోళ్లతో శ్రీరావుగారిని బొగడక తప్పనిపనియై వెంటఁబడినది. ఆహాహా? నిషఘయోగ్యలక్షణమనఁగా నిదికదా? ఎవరెట్టిరేనగుదురుగాక యుత్తము లవ్వారి మంచిచెడ్డలను బయట్టఁబెట్టరు సరికదా? వారు లోకమునెల్లఁ దమవంటిదిగనే భావించుచుందురనుట కింతకన్న దృష్టాంతమేమికావలయును. "ఆత్మవత్సర్వభూతాని" అను వచన మీాయనయందుఁ బూర్తిగా సమన్వయించుచున్నదనుట

లో నధికోక్తియుండునా? పోనిండు తమసొంతవాక్కులతోఁ జెప్పవలసినదానికి సంశయించినను స్వయముగా నవ్వారు వ్రాసి ప్రకటింపుమని తీవ్రముగాఁ గోరిన వ్రాఁతనుగూడఁ దత్క్షేమమునకై దాఁచిపెట్టఁగా నవ్వారికై వగఁజెందు నీయమూల్యక ప్రకృతి నెంతని వర్ణించి తృప్తిఁ జెందఁగలము ఇప్పటికిని మా చెల్లయ్యగారు లోనగువారును తదితర ప్రాజ్ఞలోకమును వీరిపై నూఱుపద్యము లాశుధారను జెప్పిన మమ్మును మెచ్చుకొందురని తలఁచెదము "కవితామతల్లికిఁ ధనము ప్రధానమా? రసికతాధికతా సుఖతల్ ప్రధానమా (నానారాజసందర్శనము 30 వ పుట చూ) మేర్వాదిపర్వతరాజములనేమి రత్నాకరాదుల నేమి కవులేలవర్ణించిరి వానియందలి సత్త్వముబట్టియే, ఇక్కడఁగూడ నట్టి యమూల్యమయిన గాంభీర్యగుణముండుటం జేసియే మా వారియట్లు ప్రశంసించియుండిరను తుదకుఁ బై హేతువులవలనఁ గృష్ణారావుగారొకవిధమయిన యపకారిగాఁ బరిణమించియు మాకు నమ్యుఁ డయ్యెనని తేలినది ఉపకారాపకారములెట్టులున్నను యోగ్యతయనునది సర్వత్ర శిరసావహింపవలసినదికదా? ఇఁక వీరిమిత్రుల కతన మాకుఁ దటస్థించిన యపవాదసముద్రతరణమెట్లు కృతికృత్యమయ్యెడిని? దానినన్యథా నిర్వహింతముగాక, పయికపకృతిగాఁ గన్పట్టినను వీరిమిత్రకృతి మా కుపకృతిగాఁ బరిణమించుటచే నవ్వారి హృదయమునకేని మేము నొప్పి గలిగింప నెంచక మెప్పుకలిగింపఁ బ్రయత్నించెదము ఏమందురా? ఆమిత్రు లాపాడువ్యాసమును నిజమెఱిఁగియు బుద్ధిపూర్వకముగాఁ బ్రచురించుటం జేసియేకదా? ఎందఱో మహానుభావులు యథార్థనిర్ణయమునకై తమతమ యభిప్రాయములను వెదఁజల్లిరి. సుమారు సంవత్సరమున్నరనుండి సత్యమును దేల్చుటకై

చిక్కుపడుచున్న మాకు నేఁడుగదా సుదినము, నేఁడుగదా పండుగు, సోదరులు తమకిష్టమున్నచో వేమవరపు సభకు రావచ్చును. లేదా మానవచ్చును పాపము? అమాయికులు, వృథాగాఁ గొంతపరిశ్రమ చేయుచున్నారు. ఆపరిశ్రమను వారెందులకుఁ జేయుచున్నను మాకుఁ బ్రూతిఁగాఁ దోడుపడుచున్నది చెన్నయాద్యగ్రహారవాసు లొనర్చిన శతావధాన ప్రయత్నాదికము తుట్టతుదకు ముట్నూరి కృష్ణారావుగారికి యశస్కరమైనట్లే శ్రీ సోదరులు తమనిమిత్తము సల్పి సల్పుచున్న ప్రయత్నములు గుంటూరిసీములోని కృత్రిమపురుషుల గుట్టు బయటఁబెట్టుచుండుటచే సత్యనిర్ధారణకు మాకుఁబూతిఁగాఁ దోడ్పడుచున్నవి. సోదరులకును మాకును గల తెల్వితేటలలోనేమి గవిత్వములోనేమి నైపుణ్యతారతమ్యముల నింకను గనిపెట్టవలయునని తలంచు నమాయిక స్వాభిమానుల కొకమనవి

అయ్యా,

నే నొకసామాన్య మయినవెలనాటిశుద్ధచ్ఛాందసవైదికకుటుంబములోనివాఁడను, శ్రీ సోదరకవులో? అఘటనాఘటనాపటిష్ఠంబగు నియోగికుటుంబమున నుదయించిన మహామహులు, వారునేనుండుకాకినాఁడకు వచ్చినప్పు డెట్లో నేను వారిమోముకూడఁ జూడకుండఁ దప్పించికొని వారికేవిధమైనదోసఁగును గలిగింపక కలిగింపనెంచకయుఁ గాలక్షేపము చేసితిని ఇందులకుఁ దత్రస్థులగు పెద్దమనుష్యు లనేకులు సాక్షులు, ఈయంశము గుంటూరిసీమ 106,107 వ పుటలలోఁజూడఁదగు నేనట్లుదాసీనుఁడనైతిననుటకు శ్రీ సోదరుల లేఖకూడఁగలదు దానిని అందే 85 వ పుటమొదలు 95 వ పుటవఱకును జదివికొనఁదగు అందులో 88,89,90 వ పుటలలోని కొన్నిపంక్తుల

ను మఱియు ముఖ్యముగాఁ జదివికొనుఁడు అంతమాత్రమున నాకేమి లోపమువచ్చెను. అట్లే సోదరు లీరసాభాసపు టుత్తరములు వ్యాసములు వ్రాయుట వ్రాయించుట లోనగు నపభ్రంశములకు దిగకున్నచో వారికిఁ గల యౌన్నత్య మ తక్కొడనేతగ్గిపోవునా? అట్లే ప్రాజ్ఞుఁడేని దలంచునా? ఇదియంతయుఁ జూడ భూతపూర్వగతిచే వారభిలషించుచున్న శుద్ధవైదికత్వమున కావశ్యకమగుచేదస్తమను నపూర్వగుణరాజమును బ్రకటించుకొనుటకేకాక వేఱేమియు నుగాదు. అవి మాయిరువురలో నొకరము మనవిచేసికొనుమ దీనికి సంబంధించిన యుత్తరములు పత్రికలు లోనగువి కొన్ని యుదాహరించి ఆయా యీసామగ్రివలన నిర్ణయింపఁదగు నంశమును లోకులలోఁ బ్రాజ్ఞులగు వారి శిరమున మోపి యింతకుముస్సు మామిత్రులు శ్రీ ముట్నూరి కృష్ణారావుగారిపై మోపిన భారము నిందుమూలముగాఁ బూర్తిగాఁ దగ్గింప నెంచుచున్నారము

శ్లో॥ క్రియాణాం రక్షా యై దశరథముపస్థాయ విముఖే। మునౌ విశ్వామిత్రే భగవతిగతే స్వ్రప్రతిగృహాన్। తపోత్తేశ్తక్షేశాగుపశమిత విఘ్నప్రతిభయే పరివృత్తేయజ్ఞం వారఘుకులకథై వాస్తమయతే॥

(ఇతిమురారిమ్మహాకవిః)

ఇఁక వరుసవెంబడి నుత్తరములులోనైన వుదాహరింపఁబడును పరిశీలకులు జాగరూకులై విచారింతురుగాక

"బ్రహ్మశ్రీ తిరుపతివేంకటేశ్వర కవివర్యుల సన్నిధికి

నమస్కారములుచేసి వ్రాసికొనిన విజ్ఞాపనము, కవిముఖులారా? తమరు వేమవరపు సభకు దయచేయుదురా? మీతో నత్రప్రతిసంధించుచున్న వేమవంగ్రామవాస్తవ్యులు, మీకు సంభవింపనున్న

పరాభవమునుదప్పింపఁగలరా? . జరావ్యాధిపరీతులైనమిమ్ము అవధానము చేయుటకు పిలువ వార్తలదే మొదటితప్పు, మీరు పూర్వము ప్రకటించినపుస్తకములను పఠించినవారగుటచే నట్లే ఘనులని మిమ్మునింతకుఁబూర్వమునమ్మిరికాని ఇఁకనమ్మరు అవధానముచేయుటకుఁ బ్రోత్సాహపఱచినవారి యభిమానమునే నమ్మికొని యెట్లో నూటపదాఱులును బంగారపుఁ గడియాలును బొంది పోవచ్చునని తలంచుట వట్టివెఱ్ఱిమీరుగర్వాంధకర్తలై పోతిరి గాన అంతటితోఁ దృప్తిపడుఁడు. నర్సారావుపేటసభకు నిట్లే జాబులువచ్చెను గాని యెట్లోతప్పించుకొని యనలకుఁ జేరలేదా? ఇప్పుడు నట్లేయగునని యనుకొనకుఁడు ఈయవధానముచే మీకుఁగల పరాజయ మధికము. పిదప ననుకొన్న లాభము లేదు. నేను మీయందే తాత్పర్యము గల శాఖాభిమానినయి యుండుటచేతనే హెచ్చరికఁగా వ్రాసితిని "ముందుచేదయి ముందుతోఁచునట్లు" నామాటలు మీకప్పుడు కఠినముకావచ్చును ఇచ్చటివారికి... యుక్తులు పనికిరావు దురాలోచనకలవారితో నాలోచింపక దూరాలోచన సేయుఁడు ఇట్లు వ్రాసెన నన్ను భయహృదయుని గాను ప్రతిపక్షప్రియునిగాను నెంచకుండు.

విధేయుఁడు, శిష్యసముఁడు,
విష్ణుభట్ల బ్రహ్మయ్యవ్రాలు

మీరొనర్చుపనిలో మీకు సిరగ్గళప్రజ్ఞయున్న యెడల రావచ్చును ఇతర భయమువలను

ఆయీయుత్తరము రేఫ శకటరేఫాద్యాను స్వారాదులతోఁ జక్క నివ్రాఁతలోనేయున్నది పోస్టుముద్రలో నింగ్లీషుతో సంతమాగులూరు, అనియుండదక్క నుత్తరములో గ్రామనామము లేదు, కొప

ప్పరమునంతేమాగులూరుపోష్టగుటచే సంశయపడి యయినను నిజము అగుందగునని యొకమిత్రునిపేర వ్రాయఁగా నాయన యీతీరున జవాబునొసఁగెను"

ఇట్లు,

18-12-1912

విష్ణుభట్ల బ్రహ్మయ్యయనువాడు సజీవులలో లేఁడు గనుక ఆ లెటరు వ్రాసిన వాడు...గా గశించతగివున్నది నర్సారావుపేట అవధాన సమయములో నరసింగరావుగారికి లెటరు వ్రాసినవాడికి వీడుసోదరుడై వుండవచ్చును. ఈలాటి.. వలనఏమికానున్నది, విష్ణుభట్లవారుమాకు బంధుగులు, వీరుకొల్లూరువద్ద అత్తోటవైపునున్నారు. అచ్చట బ్రహ్మయ్య పేరుకలవాడు లేడు ...పండితులను బిలుపించుటకు మేమునిండా శ్రద్ధచేయుటకు ముఖ్యమైనహేతువు అదే శ్రీపోలవరంజమీందారు గారిని ఆహ్వానంచేయుటకు నన్ను కాకినాడ వెళ్లవలసినదిగా హనుమయ్యఅన్నగారు ప్రోత్సాహంచేసినారు. రేపురాత్రినుంచి వెళ్లవలెనని అనుకున్నాను శ్రీవారిమిత్రులు మజుందారు హనుమంతరావుగారు వకీలువెళ్లుచున్నారు సిఫారుసుచేస్తామని నన్నురమ్మన్నారు నాకు రెండురోజులనుంచి కొద్దిగాజ్వరంవస్తూవున్నది వీలుచేసుకొని యేలాగైనా వెళ్లవలెననియున్నది బ్రహ్మశ్రీ నోరిసుబ్రహ్మణ్యశాస్త్రిగారు అవధానమ్నుకువచ్చెదమని వాగ్దత్తమిచ్చినారు శ్రీజయంతి రామయ్య పంతులుగారుకూడా దయచేస్తేబాగావుండును సభలో తగవులు యేమియు రానేరవు.. మీరు ఇతిలగాయతు మనస్సుకు రెస్టుతీసుకోవలయునని నాకోరిక, మీమనస్సుకు యెంత ఆనందముండునో అంతకుపది

వేలమడుంగులు లోకానందకరము తదితరుల ఆనందము లోకులకుపక
రించునది కాదు...

మే శేషయ్య,

ఈయుత్తరమువలన విష్ణుభట్ల బ్రహ్మయ్యగారు కల్పితనామము లని ధ్రువపడినది కాని యెవరుకల్పించిరో నిర్ణయింప శక్యముమాత్రముకాదు ఈసభ పూర్వపుసభలకన్నను గడ్డుసభయనియుఁ బ్రతిపక్షుకోటి విధిగా నల్లరిచేయకమానదనియు,మిత్రులలోని కొందఱు బందరు పురవాసులు కడుఁబ్రాజ్ఞులు, "శాస్త్రులుగారు? మీకున్న యశము చాలదా ? తిరిగియు నట్టిసభ కేలవెళ్లెదరు ?" అనిహితోపదేశము చేయఁజొచ్చిరి వారు స్వానుభవముచే మాకన్నఁ దత్సీమయందలి కొంద ఱతత్త్వము నెఱిఁగినవారు తప్పుడుకూఁతల వ్యాసముల నెన్నిటినో దాఁచిదాఁచి యీచెప్పునప్పటికిఁ గొలఁదికాలముక్రిందటనే పరశురామప్రీతిచేసియున్న సహృదయులు కావున వారిసదుపదేశమును మన్నించియైన నీసభకుఁబోవుటనుగూర్చి విరమింపవలసినదే,ఇదిగాక వారుసభ యేర్పఱచిన తేదీ కించుమించుగ మాలోనొకరికి ముందుదాహరించు నుత్తరములోఁ దట్టుతుదనున్న ప్రతిబంధకముగూడఁ దటస్థించియున్నది ఆజాబువ్రాసినయతఁడే విష్ణుభట్లవారియుత్తరమును జూడలేదు గాని వచ్చియున్నదనిమాత్రము వినియుండెను. చరిత్రకావున నాజాబు కూడ నుదాహరింపఁ బడుచున్నది

17-12-1912,

కాకినాడ,

నేనుయండగండినుండి యీదినమున నేవచ్చితిని తమయుత్తరము అందినది చూచితిని ప్రత్యర్థులు ఎన్నిప్రయత్నములేని జేయనిందు పర

దేవతాకృపాపాత్రులకుఁ బరాభవమన నెక్కడిది? జయతు జగదీశ్వరీ విజయేతాం తిరుపతి వేంకటేశ్వరౌ, జాగర్తు పరమేశ్వర స్తిరుపతి వేంకటేశ్వరః భూయాసుర్బ్రహ్మగురోర్బలవంతి మంగళాశాసనాని ఏధతాం భవదీయాదీక్షా...బద్ధకంకణా, కంకణాఃపతంతు నామ ప్రతిపక్షినయవప్రణాళీభ్యః స్వస్తిసుకవితాయై, నమయాత్ర కేవలం మమమాతు శేవప్రత్యాబ్దికకర్మకర్తుం నిశ్చితం కింతు...

ది. తిరుపతిశాస్త్రి

ఈయుత్తరమువలని యానందము మాలోనెవరిదో తెలియుచునే యున్నదిగదా? పిమ్మటఁ బరమానందముతో నవధానార్థము **25-12-12** సం॥ తేదీని బందరునుండి సవిద్యార్థిబృందముగా బయలుదేరుటయు రైల్వేస్టేషనులోనే యొకశుభసూచన కానవచ్చె స్టేషనుమాస్టరుగారంతకుమున్నే వినియుండిరో యేమో ఫలపుష్పాదులతోఁ దమకుగల యవ్యాజానురక్తిని బ్రకటించి పిదప నేనుదమ్ము గతవత్సరము నర్సారావుపేటయవధానములోఁ జూచియుంటినని యేమేమో వారికిఁగల యవ్యాజానురాగమును బ్రకటించిరి నర్సారావుపేటనుండి పాటిపోయివచ్చినట్లు వ్రాసిన మాసత్యవాదికి శుభమగుఁగాక యని యాశీర్వదించుచు 'క్వభోగమాప్నోతి నభాగ్యభాగ్జనః' అను నైషధోక్తిని స్మరించుకొనుచు రయిలెక్కితిమి పిమ్మట పెడనస్టేషనులోఁగూడ నిట్లే మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రులవారు సవిద్యార్థికముగావచ్చి వారికిఁగల యాదరాతిశయమును వెల్లడించిరి. పదపడి బెజవాడచేరునప్పటికి పర్చూరు సుబ్బయ్యగారను నియోగిశిఖామణివచ్చి వారికిఁగల ప్రేమనుజూపుచుఁ బ్రతిపక్షులు పన్నుచున్న కుట్రలను దామెఱిఁగినంత వఱకుపన్యసించిరి. పిదపఁ జినతాడేపల్లివద్దకు సగ్రహారస్థులపక్షమున

బ్ర॥శ్రీ॥ చావలి వేంకటకృష్ణయ్యగారెదురుగావచ్చిరి. పదపడి గుంటూరిస్టేషనులోదిగి విద్యాభిమానులగు పలువురను బూర్వమిత్రులను సందర్శించికొని ఆనాఁటికిగుంటూరనేయుండి మఱునాఁటియుదయమున నర్సారావుపేటకుఁ బ్రయాణమొనర్చితిమి. స్టేషనులో రయిలుదిగినది మొదలు బ్రహ్మోత్సవపర్యంతమును గలవిశేషముల నిక్రిందనుదాహరింపఁబోవు కృష్ణాపత్రికలోనివ్యాసము తెల్పును గాన నాజోలికిఁబోక నాఁడు బ్రహ్మశ్రీ మేళ్లచెరువుకామయ్యయను వారింటసర్వోచ్చముగావిందుజరిగినదనియు గుంటూరుసీమ కొంతవఱకు బ్ర॥శ్రీ రామడుగులరామకృష్ణశాస్త్రులవారు (వీరు శ్రీకొప్పరపుఁగవులగురువులుఏవో కొన్నిశ్లోకములు వీరిచేతనువారికిఁ జెప్పఁబడినవి, పరమోత్తములు)లోనగు విద్వత్తల్లజులకువినిపించి వారియాశీర్వచనమునకుఁ బాత్రులమైతిమని మాత్రము తెల్పుచున్నారము,

(11వ జనేవరి **1913** సం॥ కృష్ణాపత్రికనుండి)

తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రి,

అయ్యా,

శ్రీశంకపీంద్ర ఘటాపంచానన బాలసరస్వతీత్యాది బిరుదభూషితులగుతిరుపతి వెంకటేశ్వర సుధీవరుల శతావధాన మహోత్సవావలోకన కుతూహలులును నరసారావుపేట తాలూకా వేమవరం అగ్రహారవాసులునగు శ్రీభాగి చెన్నయ్యగారు మేళ్లచెరువు శేషయ్యగారుజంఝూల వెంకటచలపతిగారు వెంపటివెంకటసుబ్బయ్యగారు మున్నగుమహాజనులు సకల విద్వజ్జన సన్నిధానమున నమ్మహాకవుల సంస్కృతాంధ్రకవితాధోరణీ విలాసంబులను ధారణావిశేషంబులను సాక్షాత్కరింపఁదలచి వ్యవధానముగాఁ బండితవర్యులకెల్లరకు శుభలేఖనంపిరి.

శతావధానము 28-12-12 యను బవిత్రదినంబున జరుగునట్లు ప్రకటింపబడెను. అంత నమ్మహోత్సవాలోకన మపేక్షించిపలువురు పండితమణులా సమయంబున కాయూరు మహాకుతూహలముతోఁ జేరిరి. శతావధానులును 26 వ తేదికి నరసారావుపేటలో రైలుదిగి తమ నెదుర్కొనుట కేగుదెంచిన వేమవరపురవాసులచే శిబికాధిరోహణముమున్నగు నుపచారములతో తమ యగ్రహారంబునకు 28 రాత్రి జేర్పబడిరి. స్వల్పగ్రామమగు నీవేమవర మసంఖ్యాతులగు మహాపండితులచే నారాత్రి కేనిండి యనన్యాదృశ శోభా ధురంధర మయిచూపరుల కానంద మపరిమితముగ గలుగజేసెనది. ఆరాత్రిగోలె నన్నదాన మారంభింపబడి యజమానులయత్యంతప్రోత్సాహమువలన గ్రామాంతరాగతులైన పండితపామర జనుల మనసులను శ్రీమయనునదేవిషయమున నేని కలుగకుండజేసెను అంతమరునాడు చలువపందిరులలో నన్నదానమహోత్సనముగోవిందనామ స్మరణములతో జరిగినపిదప షుమారు 4గంటలకుజయధ్వనులతో శతావధానసభ వంగిపురం కృష్ణాచార్యులవారి యాధిపత్యముక్రింద ప్రారంభింపబడి కొంత కాలములో నొకచరణము యేబదిమందికి జెప్పంబడె అంతట సగ్రాసనాధిపతిగారు తమకుగల యవసరములనుఁ బట్టియుయజమానులకోరిక ననుసరించియు నంతటితో విరమించిపబడిమందితో మాత్రమె శతావధానము బూర్తి చేయగోరిరి పదపడి 29 తేదిన ప్రాతస్సాయంకాలములయందుసభ యేర్పరుపంబడియు ఏబది పద్యములను పాదక్రమముగా రసపుష్టియు రచనా చమత్కృతియు ననితర సాధారణమై యేర్పడఁ గడు సుఖముగా సహృదయ మనోరంజనమగునట్లు నుడివిన శ్రీయవధానుల వైదుష్యము శ్లాఘాపాత్రమని యిచ్చట వర్ణింపబూనుట కడు పునరుక్తి వీరి యవ

థానమునకు పద్యము లెల్ల వరుసగ నొప్పజెప్పుటతోకూడ నైదుగంట ల ముప్పది నిమిషములకాలముపట్టినదని ప్రత్యక్షానుభవముగల సభాస దులు నిర్ణయించిరి ఈపద్యములుసంస్కృతమునందును తెలుగునందును సమముగానున్నవి పది సమస్యలు సంస్కృతాంధ్రములలో నడుగఁబడి చక్కగాఁబూర్తిఁజేయఁబడినవి అవధానాంతమున శ్రీయవధానముల వారికి సభ్యులగు పండితకవులచేతను పరశ్శతములగు బద్దెములు కాన్కగా నొసంగబడినవి పిదప నానావిధకవితానిపుణులగు తచ్ఛిష్యులచే ఆ శుకవిత్వప్రముఖ స్వస్వనైపుణ్య ప్రదర్శనము చేయఁబడినవి తర్వాత సభాపారితోషికము రు 250 ల వెలగల పనసకాయకడియములు పనిత యార్హైనపిమ్మట కవివరుల కొసంగఁబడునని సభ్యులకు విన్కిఁజేయఁబ డె పిమ్మట నుఱునాఁ 30 తేదినసాయంసమయమున బ్రహ్మవాహన ముతో శిబికోత్సవము స్వస్తివాచనములతోను వారవిలాసి నీలాస్యవి లాసములతోడను మంగళవాద్య ధ్వనులతోడను నిర్వర్తింపబడినది ఇట్లి మ్మహా కవివరేణ్యులు పురమేగునపుడుభక్తిప్రపత్తుల కాటపట్టయి గ్రా మవాసులందరు కర్పూరనీరాజనా విధులతోడను పుష్పాంజలులు సమ ర్పించుటవలనను, బజారు యుభయపార్శ్వములగోడలనుండి పూవులు చల్లుటచేతను, తమకుగల గౌరవమును వెల్లడించి నిష్కల్మషులైరి త చ్ఛిష్యులుశిబికల యుభయపార్శ్వములను నిలచి ఆశురచితములైనసం స్కృత భాషామయములైనశ్లోకరత్నములతో స్వస్తివాచనిక మవిచ్ఛి న్నముగా సాగించిరి ఇట్టిమహోత్సవదర్శనానందముకనులార గన్న మే మామహాదమునుమాయాంధ్రసోదరులకు బంచిపెట్టుటకు ఈయుదం తము బత్రికాముఖంబునఁ బ్రకటించితిమి ఇట్లు,

చందోలు తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రి

మూయవధానమునకేమి యెఱుఁగనివారెవరుగాని ఆభాగి చె న్నయ్యగారొనర్చిన యన్నదానావధానమును మాలెక్కయేమి? మ హాభాష్యకర్తయగు శేషుఁడుకూడ వర్ణింపఁజాలఁడు. ఈయంశమును దుట్టుపడను గొన్ని పద్యములలో మేము పేర్కొన్నను సంతృప్తి మా కులవమును దృప్తిలేదు. ప్రత్తిపాటి కామేశ్వరకవి మమ్మును దూషిం చుచునేమో వ్రాసివ్రాసి "భాగిచెన్నయ్యగారు అన్నదానమునిరాటం కముగా రెండుదినములఁ జేసెరి" అని చెప్పెను పాపము? ఈ బ్రాహ్మ ణుఁ డాయన్నదానమునుగూడఁ జూచినవాఁడు కాఁడు చూచినచో రెం డుదినములని యెట్లు వ్రాయఁగలుగును. వినుండు 27 వ తేదీరాత్రి 10 గంటలకు మేము వేమవరముచేరితిమి. అప్పటికే 100 మంది వచ్చియు న్నారు. మాతో తక్కినవందయుఁ బూర్తిణయైనగి మఱునాఁడు ఆ సంఖ్య హెచ్చసాగినది ఆనాఁటిరాత్రి వేలసంఖ్యవఱకు వచ్చినది ఆ మఱునాఁడు పలువురు పలువిధములుగాఁ జెప్పికొనుటయేగాని యింద అని నిర్ణయించినవారే లేరు. "మూసి"నది పొంగినట్లున్నది. మూఁడురోజు లైనదికదా? ఆపైదినము గుంటూరిపేమ, పురాణము, నాఁడును వేయికిం చుక తగ్గినను సంతర్పణశబ్దమునకుఁ దగకపోలేదు ఆనాఁటిరాత్రి బ్ర హ్మాండమగు బ్రహ్మోత్సవము. ఇట్టిచో నెవరో కొందఱేగినను నెల్లరు నిలిచియేయుండిరి ఇఁక నైదవదినము వెళ్లలేక వెళ్లలేక యెట్లో నా కబలి జరిగిన యుత్తర క్షణముం దేపనితొందరలచేతనోగాని, "యింకను న్నచో గృహస్థ మర్యాదగా"దను తలఁపుచేఁగాని పయనమయ్యెడి పెం డ్లివారివలె నరుగఁజొచ్చిరి. ఏమైనను నాఁడుకూడ వందలసంఖ్య దిగలే దు ఇక్కడికి నైదురోజులైనది, ఆఱవనాఁడు మాప్రయాణము, నాఁ డును శతమునకు దాదాపునఁ బంక్తి లేచినది. ప్రత్తిపాటియతనికి రెం

పదినములని వ్రాయుటకుఁ జేతులెట్లువచ్చినవో, ఔరా? పక్షపాతము? అది చేయి కదలనీయదుగదా? కదలనికేమి, 5½ గంటలలో బూర్తియైన యవధానమును 12½ గంటలని పెంచి వ్రాయఁగలిగినారేదా? పాపము, వలయుచోఁ బెంచఁగల కరణికపు శక్తిగలవాఁడే, ఎప్పటన్నైననేమి హెచ్చించెనుగదా? అతనికిశుభమగుఁగాక, ఇతఁ డాసభ చూడనివాఁడు గాన నట్లువ్రాసెనేకాని ప్రత్యక్షముగా జూచిన మ॥రా॥రా॥ దూళిపాళ నరసింహముగారు (వీరుత్రోఁచినట్లెల్ల మాటలాడఁగలరు. ఆసభలోఁగూడ మాటలాడిరి. విన్నవారు సంతసించిరి) గాని పోతరాజు లక్ష్మీనరసింహముగారు, అష్టావధాని (ఈయన యింతకుమున్ను దర్బారులోఁ గొన్ని యవాకుచవాకు వ్రాఁతలను వ్రాసెను గాని నిజమునకుఁ గడుయోగ్యుఁడు వేమవరపుసభలో నింతబుద్ధిమత్తగలిగి మిన్నక కూర్చున్నవారే యావచ్చినతెగలోఁ గానరారు వీరు మాసోదరులకు బంధుగులగుటచే మాకుఁగూడ బంధుగులే, వీరినిగూర్చి గుంటూరిసీమ పీఠికలో విశేషించి చూడఁదగు) గాని వీరువ్రాసినచో నాయన్నదానము రెండురోజులుమాత్రమే అని వ్రాయరని నా నమ్మకము జిహ్వా తెసియుండి యసత్యమెట్లాడనిచ్చెడిని "ప్రత్తిపాడు" తిన లేదు గాన నట్లేని వ్రాయవచ్చును తప్పులేదు ఇఁక నీప్రత్తిపాటి వ్యాసములోని ముఖ్యాంశముల నుదాహరించి లోకులకు దృష్టిపఱుచెదముగాక.

క॥ తనచేసిన కబ్బము చే। తన"కాకవి"నంచుఁదెల్పుధన్యాత్ముల స
త్కవిధులఁదలచుట కబ్బం।బనుత్రోఁటకుఁ జంచయుంచినట్లగుఁగాదే॥

[బుద్ధచరిత్రము]

1913 సం॥ జనవరి 22 వ తేదీ ఆంధ్రపత్రికనుండి,

తావధానము రెండుదినములు 50 మందికి పదిరెండుగంట
లములోఁ బూర్తిఁ జేసిరి. సభారంభమునకు మున్ను శ్రీ భాగి
గారును వారిసంబంధులును బ్రహ్మశ్రీ కొప్పరపు సోదరక
శ్రీ వేంకటేశ్వరకవులకును రాజీకూర్చుటకై సభచేయించెద
వాడుక చేయుటచే ననేకులు వచ్చిరి.. అంతట పృచ్ఛకులలోఁ
మీరుభయభాషా కోవిదులమనియు, "ఎవ్వానిని లెక్కచే
రణ దిగ్విజయంబొనర్చినారమనియు, అసాధ్య విచిత్ర శతావ
చేయగలవారమనియు, గ్రంథములయందు వ్రాసికొని, ఇప్ప
ష్టముగా నియమము తీర్పఱచుకొనుట మీ ప్రాంతలన్నిటికి
లేకదా అనిరి. మఱియు కొందఱు దేవునైన లక్ష్యపెట్టము"
రు.. దేవరవారి సామర్థ్య మందఱకుఁ దెలిసినదనిరి.. వెంకట
రు లేచి మీకందఱకు నమస్కారములు,.. పెద్దముండాకొ
యిపోతిమి మమ్మూరక ఏడిపించవద్దు. భాగి చెన్నయ్య
నుటచే వచ్చి వారికోరికను దీసివేయలేక యేదో వేడుకగా
ఁ చేయుచున్నాము క్షమింపుఁడు అని బహువిధములఁ బ్రా
తమాత్రమునకేనా రెండుమీసము లుంచితిరని యొకరనిరి.
గారికి ధారణతప్పినప్పుడెల్ల పుస్తకములు చూపించుచుండిరి..
వేంకటశాస్త్రిగారు తుమ్మెదపాట పాడుచు. .విస్మృతి చెం
ములను సమయోచితముగా నెఱిఁగించుచు సభలోఁ గొంద
ంచుచుండిరి_

### తుమ్మెదపాట

ందిగలవారమే తుమ్మెదా, మనకేమితక్కువే తుమ్మెదా?
బాడవేతుమ్మెదా? సంగీతమునుతీయవే తుమ్మెదా? కుంద

మున్నూఱడవే తుమ్మెదా? మఱియెంతమున్ను చూడవే తుమ్మెదా, అని ఘో రోష్ణపదములు పాడిరి... అన్యోన్యపహాసము సేయుచున్న రామావధానమునకు అవధానపదము తగునా? ఇది యేమి యవధానమనిరి... వేంకటశాస్త్రిగారు కొప్పరపువారిమీఁదికి మూఁడుబుఱ్ఱపిట్టలను పెంచుచున్నాఁడననిరెను... సమస్యలు చెప్పలేక నమస్కారములు చేసిన తమరేనా కొప్పరపువారిమీఁదికి పిట్టలను బంపునది అనిరి... వేంకటశాస్త్రిగారు మాయవధానమున కిదియే కడసారియన్న మాటకు భిన్నముగాకుండ నీకముండిట్టి యాయాసమును జనులకుఁ గలిగింపకుండుటకుఁ ప్రార్థితులు"

గ్రంధవిస్తర భీతిచేఁ గొన్ని పంక్తులు వదలితిమి. సత్యసంధులు దీనిపైఁ బ్రచురించిన వ్యాసములవలనఁ దక్కినయంశములుగ తెలియఁగలవు. ఏమైనను నీతఁడు కడుయోగ్యుఁడు వీడో పంపినాఁడు ముద్రించిన మానీసులు తుదివాక్యమువలనఁగాని మఱికొన్ని వాక్యముల వలనఁగాని యెవఁడో అసత్యవాక్యములతోఁ దన ముబ్బదీర్చికొనుచున్నాఁడనియేని తలఁపక, కాదు కాదు, తలచియు వెనుక సంవత్సరము న్నరక్రిందట నిట్టి తప్పుడుకూఁతలను బ్రచురించి క్షమాపణయుత్తరము నుగూడ వ్రాసికొనియు మరలఁ బ్రచురించి తమయజమానుల కపయశము తెచ్చినచో నేమనవలెను ఏమియు ననవద్దు లోకుల యాశీర్వచనములకుఁ బాత్రములై యుక్లేమనుచుండుఁడనుట యొప్పు, ఈవ్యాసకర్తను విమర్శించుట "కంబళిలో నేవో వెదకుటవంటిది" గాన ముందుగా శ్రీ యాంధ్రపత్రికాధిపులు తమభృత్యులొనర్చిన యవివేకమునకుఁ జింతిల్లుచు నంపిన యుత్తరములను బ్రకటించుచున్నారము

29-1-1913

మీవంటి విద్వాంసులకు మనస్తాపమును గలిగించుట నాస్వభావముకాదు. నేను వ్యర్థవివాదములను సాధ్యమగునంతవరకు పత్రికయందు బ్రచురించుటను మాన్పుటకై యత్నించుచుందును అయినను నిరుపయోగములగు వ్యాసము లప్పుడప్పుడు ప్రకటితములగుచున్నవి పత్రికయందు బ్రచురితములయిన వ్యాసములయొక్క బాధ్యత నాపైనున్నను నేను కొన్ని సమయములయందు కార్యాంతరవ్యాపకముచే వాటిని జదువుట సంభవించదు రెండువారములకు పూర్వము పత్రికలో శతావధానమునుగూర్చి బ్రచురించిన వ్యాస మట్టిదయి యున్నది నిన్నను నేను దానిగురించి విచారించగా నిట్టివ్యాసములు నాలుగువచ్చినవనియును వాటిలో నొకటి ప్రచురింపబడినదనియును నాకు దెలిపిరి. దీనిప్రచురణమువలన లాభమేమియు లేదని నేనంగీకరించుచున్నాను. ముందట్టివ్యాసముల ప్రచురణము నాపమని చెప్పియున్నాను. ప్రస్తుతవ్యాసమును బ్రచురించి తమకు విచారమును గలిగించినందులకు మన్నింపుడు. వ్యాపకముగల పత్రికలయందు యుక్తాయుక్తములను బాగుగ విచారించి వ్యాసములను ముద్రించుట పత్రికానిర్వాహకుల విధియని నేనెరుగుదును నేనారీతినే పత్రికను నిర్వహించ యత్నించుచుంటిని. కాని కార్యభార మధికమగుటవలన నితరులపై నీ భారము కొంతమోపవలసివచ్చినది వారైనను ముందు దీనినిగురించి జాగ్రత్తను తీసికొందురని తమకు మనవిచేయుచున్నాను.. ...

విధేయుడు,

కా. నాగేశ్వరరావు.

నాగేశ్వరరావుగారి హృదయమెంత యుక్తాయుక్త విచక్షణతాదక్షమో యెంతనిష్కల్మషమో మాచదువరులు గ్రహింతురుగాక, ఈవీరిశోభనాక్షర పంక్తులచేతనే మూలకట్టుగ చెప్పఁజాలతె

ల్ల నశించునవియేయైనను హూణభాషాకోవిదులకొఱకుఁగా వీరిదె మే
తియొకలేఖ యుదాహరింపఁబడుచున్నది,

*Bombay, 1st February 1913*

DEAR SIR,

Many thanks to your kind letter I wrote to Mr Satavadhani Chellapillasastry abvoe the article published in the paper In future I shall see that nothing derogatory to his dignity is published in the paper But it is very difficult for me to keep up the promise as there are contributors who do not see the responsibility During my absence or when I am otherwise engaged the person who looks after the paper will not feel in the same way in the matter

Any way I shall try my best to see the prestige these well known poets and pandits is not spoiled by the publication in the Andhra Patrika Hoping you are doing well

Yours sincerly,
K NAGESWARA RAO

వృథాపవాదసముద్రములో మునిఁగి మెల్లో లేచి తదుత్తరణార్థమై గుంటూరిసీమ యను నొక పెద్దయోడను నిర్మించుచు దానికనుయాయినొక (పిన్నిసు) గాఁగూర్చుచున్న యీ వేమవరాగ్రహార శతావధాన పీఠికకుఁ దమమిత్రుల యుత్తరము నొసఁగిన నిష్పక్షపాత నియోగిశిఖామణియగు శ్రీ కృత్తివెంటి గంగరాజుగారికి భగవంతుఁడు యశోదాతయగుఁగాక. ఇంతకును శ్రీ కాశినాథుని నాగేశ్వరరావుగారనఁగా సుప్రసిద్ధులగుటచే నింతకుమున్నె ప్రపంచకమున నిష్కళంకు

లై మెసఁగుచున్నారనియు నిప్పుడు మఱియును నెసఁగుచున్నారని యుఁ దేలినది వీరు సత్కుటుంబస్థులు వీరికుపాస్యదైవము శ్రీశంకరుఁ డు, వీరియందా శంకరునిగుణము పూర్తిగా మాకుఁగన్పట్టుచున్నది. అది యాశ్రితవాత్సల్యము. అగుణమే కావలసినది. దానినే యీక్రింది శ్లోకము చెప్పఁగలదు.

శ్లో॥ దోషాకరోఽపి కుటిలోఽపి కళంకితోఽపి
మిత్రాఽవసానసమయే విహితోదయోఽపి
చంద్రస్తథాఽపి హరవల్లభతా ముపైతి
నైవాశ్రితేషు గుణదోషవిచారణా స్యాత్॥

అట్టివెట్టికరుణగల శంకరుని ప్రియభక్తులగు మాయీనాగేశ్వర రావుగారి యాశ్రయమువలనఁ బైశ్లోకమున కుదాహరణములగు నెవ్వ రుంగూడఁ గొలఁదిదినములలో సుగుణసంపత్తికలవారగుదురని నమ్ము చున్నారము. ఆశ్చర్యమేమి? చందనద్రుమముచుట్టుపట్టులనుండు వేఁపచె ట్లులుగూడఁ జందనద్రుమములగుట వినుచుండుట లేదా, సర్వదా భగ వంతుఁడు వీరికట్టిశక్తిని బ్రసాదించి లోకాపకర్తలను లోకోపకర్తలు గా మార్చి పుణ్యముగట్టికొనువారినిగా సమర్థించుఁగాకయని యాశీ ర్వదించుచు సత్యసంరక్షణ తత్పరత్వము నొసంగుటకు భగవంతుని బ్రార్థించుచున్నారము.

శ్రీనాగేశ్వరరావు పంతులుగారు మాచేఁదిరిగియు బ్రశ్నింపంబడి యుఁ దమయభిప్రాయమును బత్రికలోఁ గారణాంతరమునఁ గాఁబోలుఁ బ్రచురింపఁ జాలరైరి, ఆహేతువున నసేకులు ప్రత్తిపాటి వ్యాసము నందలి యసత్యములను దెల్పుచు వారినిగూడ స్పృశించుచున్నారు, ఈస్పృశించుట చాలఁదప్పిదము. ఏనను వారికీవిషయము తెలియదు

నౌకరులుచేసిన దుష్కృత్యములు యజమానులకు సంఘటించుట యిట్టిదియే కాని, వారెల్లఁ గొంతపాప మార్జించుకొనుచున్నారనుటకు సందియములేదు, వారాశ్రితమాన సంరక్షణార్థమై తమపత్రికలో వెంబడిగఁ దమ యభిప్రాయమును బ్రచురింపఁ జాలరైరి, అదితప్పుగాదు, ఆయాశ్రితులు దండతాడిత భుజంగములవలె రోఁజుచు దినదినము మిత్రుల కుత్తరము లొక్కొక్కరీతిని మార్చి వ్రాసికొనుచుఁ దమ ప్రతిజ్ఞలను వెళ్లఁగ్రక్కుచునే యున్నారు, అవిక్లబ్బులలో వినికి యగుచున్నవి, పెద్దమనుష్యులు నిజముకనిపెట్టుచున్నారు, ఇది యిట్టులుండుఁగాక, ఇతరులు నాగేశ్వరరావుగారిని స్పృశించుటవలనఁ గలిగెడు దోషమును మా, యీయవధాన ప్రకటన మూఁపఁగల్గినను దీనిని వెంటనే ప్రచురింపఁ జాలమిచేఁ దద్దోషమును మమ్ము స్పృశించుఁగాక శ్రీభగవంతుని వేఁడికొనుచు నిఁక నీపత్రికాపాటివారి వ్యాసముపై నితరానమ్మిన పహేతుకచర్చలనుండి తగుమాత్రము దాహరింప నెంచుచు శ్రీనాగేశ్వరరావు గారి పేర మాశిష్యుఁడు కమ్మవంశజుఁడు త్రిపురనేని రామస్వామి స్నేహాధర్మమున వ్రాసిన లేఖను వారికిఁ జూపిరో చూపకయో, గాని దానికి జవాబుగాఁ దమధార్ష్ట్యము నెల్ల వెల్లడించుచుఁ దమపట్టణమందుండెడి మాండేగారొకనిచేఁ వ్రాసినయింగ్లీషుత్తరము నిట నుదాహరించుచున్నారము.

*28th January 1913*

DEAR SIR,

I thank you much for your unsolicited advice My name is sufficiently strong not to be afraid of your frowns or frets. Please do not be carried away by the impression that the whole world hangs on this or that man.

(Sd)

## XXIII

ఇంగ్లీషులోని మూబోట్లనుండక, నీమాత్రపు వాక్కు శుద్ధిగల సూక్తులుపిల్లవానికేవి దురూహ తెల్లముకదా? నారాయణా? వారాయణా? ఎట్లో పత్రికా సంపాదకత్వమును వహించిన యే మహనీయుని యింత దురూహతో నుండుట వింటిమా? దురుద్దేశములేదే యనుచుఁగాక దానినిట్లు వెలువరించు కొనుట నా? ఇదిగాక "నాపృష్టః కస్యచిద్బ్రూయాత్ ,, తన్ను రామస్వామి యడుగ లేదు, తన పేర నుత్తరము వ్రాయ లేదు, తానేల వ్రాయవలసివచ్చెనో గదా? అన్నా? దురుద్దేశమా? నీయాటసాగనికాలము వచ్చుచున్నదని నీవిట్లుచిందులు ద్రొక్కుచుంటివా? త్రొక్కుము నిజము బయలెక్కు కాలమువచ్చుచున్నదిలే, వచ్చుచున్నదియననేల? రానేవచ్చినది, చదువరులారా? ఈ రామస్వామియును మాశిష్యునితో నీమన యుపోద్ఘాతకథానాయకులు పేరు వెట్టి నిన్నును నీగురువును. ...... .... .... ... ......

...... నాచెవిని జాగ్రత్త, ఆఱువేలచందాదారులుగల పత్రిక కధికారిగ వెళ్ళుచున్నానని ప్రగల్భోక్తులుపలికెనఁట! వింటిరా? అట్లుపత్రియను నదకు గుంటూరిసీమలోని తెప్పవడ్డ వారల యాహాకారమును దేల్చదగు పాదువ్యాసమును బ్రకటించి పట్టువడి యక్కటకమునఁ బరమోపకారిగాఁ బరిణమించిన యీయాయనకును మన్నారాయణుడను గ్రహించుఁగాక ఈయుత్తరమువలననే యింతవఱ కీయనకుని ధార్ష్ట్యము తేలుచున్నది. మహామంత్రులు మ॥రా॥రా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య బి. యే. యమ్. బి. సి. యమ్. గారిపేరఁ గృష్ణాక్లబ్బువారికెల్ల వినిపించుటకుఁ గోరి వ్రాసికొన్న యుత్తరమువల్ల నెంత తేలునో గదా? ఐననేమి వాడు దానిని రోసియుఁ గ్లబ్బుతో మాత్రము వినిపింపగలిగెనేకాని మాకాయుత్తరమునిండఁజ్వచో నిత్తురో? ఈయదోషు

యట్టియాచ్వాదైన్యమున కుపక్రమింపక "వారిధర్మమా"అని క్లబ్బులోఁ బలుపురముందట వినిచినందులకే వారికి మాఁవందనములు సమర్పించుకొనుచు నాయుత్తరము నాలించిన ప్రాజ్ఞమహాశయులపై నద్దానిని వ్రాసిన మహాభాగుని యుద్దేశ మెట్టిదియో సమయమువచ్చినప్పుడెల్ల వ్యక్తీకరించి నిజమును నిలువఁబెట్టుఁడని ప్రార్థించుచు నితరుల లేఖలను వ్యాసములను గొండొక యుదాహరించుచున్నారము.

**1913** సం॥ **12** వ ఫిబ్రవరి ఆంధ్రపత్రికనుండి చెన్నపురినుండి లాకాలేజి విద్యార్థియగు ఎమ్ ఎస్. సుందరం బి. ఏ., గారిట్లు వ్రాయుచున్నారు —

జనవరి **22** వ తేది ఆంధ్రపత్రికలో ప్రత్తిపాటి కామేశ్వరకవిగారు వేమవరపు శతావధానమునుగూర్చి యేమేమో వ్రాసియున్నారు. నేనుగూడ ఆగ్రామమువెళ్ళి అవధానాంతమువరకు నున్నవాడగుటంచేసి శ్రీకవిగారు వ్రాసినవానిలో పెక్కు అసత్యములు గన్పట్టుచున్నవి.

ఈకవిగారు వ్రాసినదానిలో సత్యము బొత్తిగా లేకపోలేదు. ఇందు నిజమేమన, తిరుపతి వేంకటకవులు 28 వ తేది అవధానము చేసినదియొకటి. ఏబదిమందికిచేయుట రెండు. వేంకటశాస్త్రిగారు మొదటిపాదమును, తిరుపతిశాస్త్రిగారు మిగిలినవియు చెప్పుటమూడు. కొన్ని నియమము లేర్పరచుట నాలుగు. వేంకటశాస్త్రిగారు తుమ్మెద పాటపాడుట అయిదు. సభయొక్క కట్టుదిట్టమునకై శ్రీమాన్ మాడభూషి వేంకటాచార్యులవారేర్పరచిన నియమములవ్రాసి అగ్రాసనాధిపతిగారికిచ్చిరి. తుమ్మెదపాట విషయము అయ్యా! ప్రత్తిపాటి కవిగార్యా! తమరు సభయందు ఉన్నారా? శ్రీవేంకటశాస్త్రిగారు కందమ్ము

"పాడ వేతు మ్మొద" యిత్యాది పాదములు పాడినారా? దేహార్గోగ్యము లే మివారు ధారణపట్టక సభ వదలి అచ్చటచ్చట తిరుగుటచూడ రా? అవధానము అయిన వెనుక 'పంచపాండవులు తుమ్మొద, కౌరవులు వచ్చారు తుమ్మొద' యిటువంటి పాదములు కులాసాగా పాడిరిగాని అవధానము జరుగునప్పుడు ఏమీపాడలేదని మీకు తెలియదా? ఇట్లు అసత్యముల వ్రాయుట యెందుకు?

వీరు వ్రాసిన విరుద్ధములు పెక్కులు. అందుకొన్నిటిమాత్రము తీసి వ్రాసెదను ఒకటి, అవధానమునకు పట్టినకాలము. వీరు వ్రాయునది 12 న్నర గంటలు నిజముగా పట్టినది 5న్నరగంటలు ప్రెసిడెంటుగారును మరికొందరును చూచి అప్పుడే అందరు వినునట్లు సెలవిచ్చిరి రెండవది సభ రాజీకై కూర్చబడినదిగాదని వారంపిన ఆహ్వానపత్రికలే చెప్పుచున్నవి. కవిగారీమాట వ్రాయుటలో సభకైవచ్చినవారిదారు వేలమంది రాజీకై వచ్చిరి గాని అవధానమును అవధానులను చూచి యానందించుటకు రాలేదని సూచించుచున్నారు తిరుపతి వేంకటకవులు వేమవరము వెళ్లినపుడు మధ్యగ్రామములందు వారికిజరిగినమర్యాదలు, వేమవరపుసభయు, తిరిగివచ్చునప్పుడుఆయాగ్రామములందుజరుగుసపర్యలును నేకారణముచేనంతమందివచ్చినది స్పష్టీకరించగలవు? మూడవది, పృచ్ఛకుల నేర్పరచుటలోనియమము లేమియు లేవు ఇష్టమువచ్చినవారు వచ్చి కూర్చుండిరి. ఈపెద్దసంఘములో వరుసయేర్పరుచుట యొక తప్పా? పట్టాభిరామశాస్త్రిగారును, శివరామశాస్త్రిగారును, పట్టాభిరామయ్యగారును వారికి ఆరోపింపబడిన దోషములు చేసియుండలేదు పట్టాభిరామయ్యగారు వ్రాయునది అవధానిగారి చూపుట యెట్లు తటస్థించు? మొదట రెండుపద్యముల వ్రాసి ఆవల

మానివేసిరి. పట్టాభిరామశాస్త్రిగారు కడుదూరమున కూర్చుండిరి. శివరామశాస్త్రిగారు అవధానిగారి దగ్గర కూర్చుండగా తిరుపతిశాస్త్రిగారు మెన్నిసార్లో కసరుకొనిరి. ఇట్టి సందర్భములలో మాకవిగారు ఏమియు కొంకక అన్నృతములు ప్రకటింప సాహించిరిగదా. నాలవది, ఏబదిశ్లోకములకు పద్దెనిమిదింటికి చేయుటయే మొదటినుంచి యుద్దేశమని వ్రాసియున్నారు దీని నాలోచింతము మొదటినాడు సంఖ్య యేర్పరుపకే చెప్పి, మరునాటి యుదయమున వేంకటశాస్త్రిగారు 'నూరుగురకు చెప్పెదము ప్రతిష్ఠకును చెప్పలేకపోవుచున్నార'ని యెంత చెప్పినను, భోజనప్రయత్నములు చేసిన చన్నయ్యగారును వారి సోదరులగు శ్రీరాములుగారును 'క్షేమమనుకొన్న సంఖ్యకంటె నాలుగురెట్లు జనములువచ్చి, మేము భరింపజాలకపోవుటచే, ప్రెసిడెంటుగా లేబదియుందికి చెప్పుమనిరి. అయిదవది, ఈ భంజభాషాశ్లోవిదులగియున్న ఎవ్వానిని తెనుగుపెట్టుమనియు నేమేమో ఎవరో యెప్పుడో యెవరితో అడిగినారని వ్రాసినారు. అట్టి అవాచ్యప్రసంగమును లేశమును సభలో జరుగలేదని నేను స్పష్టముగా చెప్పగలను. పండితుడైన వాడీకీతి మాట్లాడగలడా? ఒక భట్రాజు కుఱ్ఱడు లేచి సహ్యాజస్తోత్రముల మొదలిడెనుగాని యిట్టివేమియు అవనే లేదు. వేంకటశాస్త్రిగారు ప్రార్థించిరని వ్రాసిరి. అట్లు ప్రార్థించుటకు వారికేమి అవసరమో నాకు తెలియదు వారి స్వభావము గుర్తెరిగినవారు నవ్వుదురు.

ఆరవది, యిద్దరు చేసిన అవధానమగునాయని యెవరును ప్రశ్న చేసియుండలేదు ఇద్దరు చేసిరనుట నిజముగాదు చేసినను అది తప్పుగాదు. వారిద్దరు ఒకటియే. ఎవరు చెప్పినను భేదములేదు ఈసంగతి యిదివరకే తెలిసికొనదగినది. దాని నెరుంగకుంట యెవరితప్పు? ఏడవది

యు అన్నిటిలో ఆశ్చర్యకరమయినదియు బుట్టుపిట్టల విషయము. ఏమండి కామేశ్వరకవిగారూ! ఈమాట వెంకటశాస్త్రిగారనగా మీరు విన్నారా? ఏసందర్భములో అన్నారు? ఎందుకన్నారు? బ్రహ్మశ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు కారణాంతరములచే ఆశుకవిత్వము చెప్పుచుండ, మీరిట్లు అభిప్రాయపడిరిగాబోలు? ఎంతపొరపాటు. ఇట్లింత వ్రాసినను కింకవీంద్ర ఘటాపంచాననుల కేమియు లోపములేదు. అయ్యా యిట్లు అసత్యాలాపముల నిక వ్రాయక, సత్యమార్గావలంబులై, కవులుమాన్ప యత్నించువారలకు తోడ్పడుదురని నాప్రార్థన.

(1913 జనవరి అభినవసరస్వతి నుండి)

తిరుపతి వెంకటేశ్వరకవులు

ప్రత్తిపాటి కామేశ్వరకవిగారికి ప్రత్యుత్తరము

.. ......సరసముగా నవధానము జరిగినది. నూరుమందికిఁ జెప్పించుటకు నేనుతూగజాలనని భయపడితిని. అట్టిచో నన్ననక ఆలోటేను అవధానులపై బెట్టనేల? ఎన్నో అసత్యములు వ్రాసిన యీకామేశ్వర కవి కీయసత్య మొకతప్పిదమా? నేను వారికిని వీరికిని రాజీకై పిలిపించుట యెట్టిది? ఎన్నఁడో పాతిపోయినవారిని నేనిప్పుడు రాజీకి బురికొల్పుదునా? దూరస్థు లీయంశము నెరుగకున్నను తల్లిపుట్టిల్లు మేనమామగారిల్లనునట్లు ఊరిప్రక్కనున్న మాకొప్పరపువారితత్వము నాకుదెలియదా? నేను వారంత పండితుడనుగానేమో గాని తక్కినయంశములను దెలిసికొనజాలనా? సోదరకవు లీయవధానమునకు జేయనెంచిన యుపకారములకు నావద్ద సాధారములులేవా? వారి రాకను గూర్చిన రికార్డు నావద్దలేదా, ఎందులకీసోదె, మానీయములోని కొంతసారము నిదివఱకే ఆంధ్రపత్రిక కంపుచుగుననుకొంటిని. కాని యెట్టిగి

యు కాలక్రమాంతరమున పోసపోయినది ఘనులకు నీచసంపర్కమువల న వచ్చు దోషము ప్రస్తుతపు ఆంధ్రపత్రికవలన దెలిసికొనవలసియున్న ది. ఇట్టి తప్పుడువ్రాతలు వ్రాయువారి దోకతప్పకాదు సత్రములలో పెడ్డలు వేయువానికి తప్పేమి, యొప్పేమి, పత్రికలు నడుపువారా వ్రాత లోని జాడను గుర్తింపవలదా? ఎంతపసిపిల్లవానికేని యీవ్రాత తప్పు డువ్రాతయని గోచరించునుగదా? లేదా కృష్ణలోని తాడెపల్లి వెంకట ప్పయ్యశాస్త్రిగారి వ్యాసమువలననేని యీవ్రాతతప్పని తెలిసికోవచ్చు నుగదా? ఆశాస్త్రులవారికన్నను ఈకవిగారు యథార్థవక్తలని ప్రొ ప్రయిటరుగారుతలచిరో? మేలుమేలు, సంపన్నగృహస్థునచునమ్మిక నా యందు ప్రొప్రైటరుగారి కుదయించినచో చేసిన పొరపాటును పత్రి కాముఖమున బ్రకటించి నిష్కళంక చరిత్రులై యిట్టి సత్కార్యముల నొనర్చువారికి విఘ్నకర్తలు గాకుందురుగాక యని కోరుచు వారి స త్యమును వారి ఘనహృదయమును, వారిసంపన్న గృహస్థత్వమును, వారివిద్యాపక్షపాతిత్వమును దెల్పదగు పత్రికకై యెదురుచూచుచు నిం తతో విరమించుచున్నాను.

ఇట్లు,
భాగి చెన్నయ్య.

(4 ఫిబ్రేవరి 1913 సం॥ సువర్ణలేఖనుండి)

వేమవరపు శతావధానము

ప్రత్తిపాటి కామేశ్వరకవిగారు పడినపాటులు.

తుమ్మెదపాటలు.

ఓ ఆంధ్రమహాజనులారా!

**1912 సం॥ డిశంబరు 28,29** తేదీలను నరసారావుపేటలో

శా వేమవరము అగ్రహారమున బ్రహ్మశ్రీ తిరుపతి వెంకటేశ్వరకవుల చే నొనర్పబడిన శతావధానము దిలకించినవారిలో నేనొకడను........ వేమవరపు శతావధానవిశేషముల నావలన వినిన నామిత్రులొకరు జనవరి 22వ తేదీ యాంధ్రపత్రికం దిలకించి మనకామేశ్వరకవిగారివ్రాతయొక్క నిజానిజముల నావల్ల నెరుంగ నెంచి నన్నడిగిరి. ....... రాజకొరక నేకులు వచ్చియుండిరను వీరి మడత . ట కేవలము వీరి యసూయత వెల్లడించును ఇది యిటులుండ యీకవిగారవధానము 12న్నర గంటలకాలములో ముగింపబడినదని వ్రాసిరి. అట్లుగాక 5న్నర గంటలలోనే పూర్తియైనదని లిఖించుచున్నాను. మరియును వెంకటశాస్త్రిగారిచే జదువబడినదని లిఖింపబడిన తుమ్మెదపాట యీకవిగారి స్వకపోలకల్పితమని చదువరులెరుంగగలరు. శ్రీ శాస్త్రులవారు పాడెడు తుమ్మెదపాట యందమును, నడకయు, పొందికయునువేరు ఆపాటకును దీనికిని చాలభేదముకలదు. మఱియును ప్రత్యక్షముగా నాయవధానమును చూచిన నాబోంట్లు యింకను విమర్శించుటకుగూడ సందేహించు కొన్నియసత్యపువ్రాతలు మనకవిగారు వ్రాసిరి. మరియొక చిత్రము వినుడు జానపాటి పట్టాభిరామ శాస్త్ర్యాదులు అవధానిగారికిరుప్రక్కలను కూర్చుండి పెద్ద పెద్ద యక్కరములతో కాగితములపై వ్రాయుచు ధోరణితప్పినపు డవధానిగారి కాకాగితములం జూపుచువచ్చిరని లిఖించిరి. చూచితిరా! యీవిరుద్ధము. పట్టాభిరామశాస్త్రిగారివంటి యుత్తములు తత్పండితసభా మధ్యంబున యట్టికృత్యమ్ము నొనరించిరనుట. గుంటూరుఅవధానములో "మధ్వ శ్రీ కాశీకృష్ణాచార్యులవారు అరచేతిలో వ్రాసి చూపిరను" సత్యవాదిగారి అసత్యపువ్రాతను జ్ఞప్తికిదెచ్చుచున్నది. ఆసభలో "యింతమాత్రమునకే

సా రేంకుమీాసము లుంచితిరి." అని యొకరనిరట. వారిమీాసముల మాహాత్మ్యము జక్కగా నెరిగిన యచ్చటి సభ్యులలో నెవరును అట్లని యుండ లేదు. గాని, మన యీాబుఱ్ఱపిట్టల సృష్టికర్తగారు నూతనులగు టవలననో, వారిమీాసములపస బాగుగా గుఱుతెరుంగక పోవుట వలననో శాఖాభిమాన మహాపిశాచావేశమువనో, యిట్లు తమపండితమ్మన్య త్వమును వెల్లడించిరి. .. .... . .తఱచిచూడ నింతకును యీాకవిగారు యవధానమునకు వచ్చియుండ లేదని విశదమగుచున్నది. వచ్చినను వీరి నేత్రేంద్రియ శ్రోత్రేంద్రియములు వీరిస్వాధీనములో లేకపోవచ్చును. ఓకవిగారూ! మీామీాఘాందసత యింతమాత్రముచే మనము లోకులక న్నులు గప్పజాలము. మీారును నేనును గాదుగదా? వేలకొలది జనులు చ్చటికివచ్చియుండిరే. మీా యాత్రవ్రాతనుగాంచిన వారెల్లరెంత మనస్తాప మును జెందుదురో? చూడని మనయాంధ్రులెల్లరెంత కల్లోలపడుదు రో యను యాలోచనకలిగి మీాహృదయమునడిగినచో మీాకు బాగు గ బోధించియుండును. ఈమాత్రమున మహాపురుషుల కీర్తికాంతకు మ చ్చగలిగింపజాలమని రూఢిగా నమ్ముడు. స్వబుద్ధిమాంద్యము నితరుల హృదయములందును జొన్పయత్నింపకుడు. నేడు మన బొంబెల్లును బయలుదేరి పత్రికలను చాటించినంతమాత్రమున శ్రీ తిరుపతి వెంకటేశ్వ రుల కీర్తికి భంగము కలుగనేరదు. "దగ్గిన నూడెడిముక్కు తుమ్మిన పుడు నిలుచునా?" యను సామెతగా మీాయపభ్రంశపువ్రాతలవలన వారికీర్తికిఁ గొంతయు గలుగదుగాని విద్యావంతులును, యుదార స్వభావులును ధర్మశీలురునునగు శ్రీ యాంధ్రపత్రికాధిపతిగారిని గూడ మోసగించి ప్రకటనానర్హమగు మీా వ్యాసమును ప్రకటింపజేసిన భవత్సాహసము నేమని వర్ణింతును...... .... యింతకును యీాకవి

గా రవధానమునకు దయచేయకపోవుటవలననో విన్నమాటలు బుద్ధిమంతులవలన వినినవికాకపోవుటవలననో లేక మఱి యెవ్వరిప్రోత్సాహమువలననో వ్రాసియుందురు. కాని నిజముగా నాయవధానముం జూచిన యేబుద్ధిమంతుడును అట్లులిఖింప సాహసింపడని వ్రాయుచు నింతతో విరమించుచున్నాను.

శా॥ ఓ కామేశ్వరరావుగారు! మదిలో • నెక్కింతయుఙ్ కొంకులే
కీకేకల్ పదిమందిపండితు లి • దేమీ? యీవిరుద్ధంబటం
చేకంబొచు చివాట్లుపెట్టుదురు మీ • కీమాత్రముందోచలే
దా? కారుల్ప్రకటింప న్యాయమొకో? త • ధ్యంబంచుమన్నింతురే॥

మ॥ అరరే ఎంతటివెఱ్ఱివాడవొకదా! • హాస్యంబుగానుండదా?
రసుల్ గాంచిన, పండితుల్ భళిర వి • శ్వాసార్హమంచెంతురే
పరువా పండిత దూషణంబువలనఙ్ • పాపంబుగాదొక్కొ? యీ
కరణిన్నాంధ్రుల పత్రికాదరము గం • గంగల్పగానెంచితే?॥

ఇట్లు,
బుధజనవిధేయుడు,
K S. Giri Row

(1913 సం॥ ఫిబ్రవరి 15వ తేది కృష్ణాపత్రికనుండి)

. ... ఆంధ్రపత్రికలో నెవరో నిదివరకు మేము వినియుండని కవి యొకడు శ్రీ తిరుపతివెంకటేశ్వరకవులచే వేమవరం అగ్రహారములో భాగి చెన్నయ్యగారిచే జేయించబడిన యవధానమును గురించి అసత్యములు ప్రచురించెను. ఆయవధానం సాంతంవర్కు మేముకూడనుండియే యున్నాము అవధానము 5న్నర గంటలో పూర్తిచేయబడెను సభికుల కోరికననుసరించి భారతకథవచ్చులాగున తుమ్మెదపాటపాడిరే

కాని ఆకల్పిత కవి వ్రాసినట్టు జరిగివుండలేదు. యింతయేల? యవధా నము జయప్రదముగా జరిగినదనుట కనేక పండితులొసగిన స్తుతిపద్య ములే ప్రబలసాక్ష్యము.

యిట్లు తమవిధేయులు,
పసుమర్తి లక్ష్మీకాంతంవ్రాలు,
(వేమవరం అగ్రహారం కరణం)
" శేఖరరాజువ్రాలు,
(వుప్పు మాగులూరు కరణం)
" సీతారామయ్యవ్రాలు,
(వుప్పుమాగులూరు యీనాందారు)

ఉ॥ పత్తులువ్రాలరోసె నొక పల్లియ వేమవరంబు తత్సభా
ధ్యక్షుత మీరొనర్చిన బుధస్తుత దివ్యశతావధాన గీ
ర్దక్షతచే జనాళి శివరాత్రిమనంబుల రోసిరన్న చో
నీక్షితిరాజ రాజసభ లేమని చెప్పుదు వెంకటేశ్వరా?॥

తెలికేపల్లి రామచంద్రియ్య.

ఈయుత్తరములకేమి నిజముతేలి చాలనేపైనది. ఇవి యభ్యు చ్చయార్థమగుఁగాక. ఇట్టి వెన్నేనిగలవు ఇఁక సోదరులంగూర్చి యిం చుక వ్రాయుదము. ప్రపంచస్వభావము నెఱిఁగియో యెఱుఁగకయో గాని శ్రీ మాసోదరులు చాల ననాలోచనగాఁ బ్రసంగించుచున్నారు. వృథాదూఁకులు దూఁకుచున్నారు ఈదూఁకులు మాకేకాక మాశి ష్యుఁడును సుప్రసిద్ధతర వడ్లమన్నాటి వంశ్యుఁడును నగు నరసింహ శ ర్మకుఁగూడ సంబంధించుచున్నవి. ఈబాలకవి అమాయకుఁడు నిజ మాడనివా రితనికి శత్రువులు నిజమాడువారే మిత్రులు, ఇట్టి యితఁ

స్వరముగ నాహ్వానము జేయుటచే బ్ర॥ తిరుపతి వెంకటేశ్వర కవీశ్వరు ల చ్చటికి విచ్చేసి శతావధానసభను జేయుట కుపక్రమించిరి. సభాభవన మంతయు పండితబృందముచే నిండి నిబిడీకృతమైయుండెను. పృచ్ఛకులు యాభైమంది గూర్చుండిరి. ప్రథమదివసమునందు బ్ర॥ వేంకటేశ్వర శాస్త్రిగారు పృచ్ఛకుల మనోరథానుసారముగ ప్రథమపాదమును పూర్తి చేసిరి. మఱునాడు బ్ర॥ తిరుపతిశాస్త్రిగారు పాదత్రయమును పూర్తి జేసి పద్యములన్నియు జదివివేసిరి. సభాస్థానమునకు వచ్చియున్న పండితాభిమానులును విద్యాభిమానులును నవధానులనుగురించి స్తోత్రపద్యములను జదివిరి. జయజయజయేతిధ్వనులతో నాటిసభ ముగింపబడెను. దివసద్వయమందు నీశతవధాన మయిదున్నరగంటకు పూర్తి అయినదని సభికులు నిశ్చయించిరి. శ్రేయాంసి బహువిఘ్నాని యన్యాయముగ శాఖాభిమానులు కొండఱవధానాంతరాయమునకు ప్రయత్నించిరిగాని అగ్రహారికుల పుణ్యముచేతనో తిరుపతి వేంకటేశ్వరమహిమచేతనో సభికుల సుకృతముననో సభ జయప్రదముగా జరిగెను తరువాత శ్రీవారు శిష్యబృందముతో నాదుగృహమున కేతెంచిన నన్ను కృతార్థుంగావించి స్వస్థానముం ప్రవేశించిరి. తరువాత కొన్నిదినములకు కొప్పరపుంగవులలో వేంకటరమణకవిగారు రాజాపేట గ్రామమునకుబోయి తిరుపతి వేంకట కవీశ్వరుల శతావధానము బాగుగలేదని కొన్ని కారణములతో నొకమహజరునామాపత్రమును వ్రాయించుకొని బ్ర॥ పోలేపెద్ది నాగిభూషణంగారిని పోలేపెద్ది వేంకటకృష్ణయ్యగారిని లంకా వేంకటనారాయణగారిని మఱియొక విశిష్టాద్వైతిని పద్యములచే స్తుతియించి ఈమహజరునామాపత్రమునందు దస్కతులు దగిలించుటయే నన్ను సన్మానించుట యని ప్రార్థించినారట. వారు

గౌరవనీయులును పండితపక్షపాతులును విద్యాభిమానులునవుటవల్లనతగిలించనైరి కాబోలు ఆగ్రామములో మఱియొకసంస్కృతపండితుఁడీకవిగారి నొకసంస్కృతశ్లోకమును జదివి దీనికి సరియయిన తెనుఁగుపద్యము జెప్పమనికూడా నడిగిరట నంతట కవిగారు యస్త్యజ్ఞాన దయాసింధో జెప్పిరట. ఈవృత్తాంతము నేను రూఢిపర్చగలను. శతావధానసమయమునందు బ్ర॥ భాగి చన్నయ్యగారు ఈకవులకు రాజశ్రీ యని పై చిరునామవ్రాసి ఆహ్వానపత్రికను పంపియున్నారు. కొందరీ కవులతో సభాదర్శనార్థమై వచ్చెదరాయని నడిగితే మాకు పై చిరునామయందు బ్రహ్మశ్రీ వ్రాయలేదు. ఆకారణముచే రామనికూడా జెప్పిరట. అంతట శ్రీ చన్నయ్యగారొక పత్రికయందు బ్రహ్మశ్రీయని వ్రాసి తిరిగి పంపిరట తురకవానిచే పంపుటవలన మేము రామని తిరిగి జెప్పిరట. తరువాత గుంటూరు నివాసులగు శ్రీ సోమయాజులవారును నరసరావుపేట నివాసులు శ్రీ చావలి కృష్ణయ్యగారును కవిద్వయమును బిల్చుటకై వెళ్ళినప్పుడు వారికి మాకు విరోధము గనుక రామని జెప్పినారట ఈ కవులు గౌరవముతో సభకు బిల్చినప్పుడు బోక మహాకవుల కపయశమును గల్గించవలయునని ప్రయత్నించుటలుజూడగ భోజాభజంత్రీ మేళములతో సూపోదనానికి బిలిచితే బోక గోడకుండా గోంగూరనడిగినసామెతెగానున్నది.

మహాజరునామాను ధృవపర్చుటకైనీకవిప్రయత్నించినట్లున్న దస్కతులుజేసేవారలెవరుతటస్థింపక ఈప్రయత్నమునుమానుకొని కామేశ్వరకవిగారిని బురికొల్పినట్లు స్పష్టమవుచున్నయది. ఈకవిగార దృష్టపూర్వుడు నశ్రుతపూర్వుడు. ఈకవిగారివ్యాసమంతయు సమగ్రముగ చదివిజూచితిని. ఈకవినామము సార్థకమైనదేయని నేనుకు

డికరమెత్తి దృఢముగజెప్పగలను. ఈకవినిజముగ నీశ్వరుడైనయెడల శతవధాన సభాసమయంబున పండితబృందసమక్షమునందు మీారు శతవధానము బాగుగ జేయలేదని ధృఢముగ జెప్పవలసియుండెను.

శ్రీవారిసన్నిధిలో నోరు..... ..... ..... .. ...సభనువిడచివెళ్లి శ్రీవారిశతవధానము బాగుగలేదని పత్రికలయందు వ్రాయుటలు జూడగ కుహూపీయెందుకుబుట్టినావంటే సురూపులనెక్కిరించబుట్టినానన్న సామెతగానున్నది. ........ . ........... .......... పండితులసన్నిధిలో మాటలాడక తరువాతపండితదూషణజేయుటభావ్యముగాదనియు, అసత్యవ్యాసములను పత్రికలయందునింపి మహాశవులకపయశంబునుసంపాదించుటకు ప్రయత్నించుటయు, భగవద్విరోధులమాటలునమ్మి వేషములనుధరించుటయు, శ్రేయఃప్రాప్తికికారణములుగావని ఈకవిగారిహృదయమందు తోచేలాగుపరమేశ్వరుడను గ్రహించుగాకయనినుడివినింతటితో విరమించుచు ఆంధ్రపత్రికాప్రయిటరుగారుగూాంధ్రదేశంబునసేక వీరులైవిరాజిల్లుచున్న బ్ర॥ తిరుపతివెంకటేశ్వరకవీశ్వరుల మహిమను జక్కగ తెలిసినవారలైయుండియు, అనృతవ్యాసములను వెల్లడిజేయుటకై వారికిబుద్ధినొసంగిన బరమేశ్వరుని బ్రార్థించుచున్నాడ.

ఇట్లు.
శంకరమంచి లక్ష్మీనారాయణశాస్త్రి.

ఈయుత్తరములకేమి నిజముతేలి చాలస్పష్టపైనది. ఇవి యభ్యచ్ఛయార్థమగుఁగాక. ఇట్టి వెన్నేనిగలవు. ఇఁక సోదరులంగూర్చి యిం చుక వ్రాయుదము. ప్రపంచస్వభావము నెఱిఁగియో యెఱుఁగకయో గాని శ్రీ మాసోదరులు చాల ననాలోచనగాఁ బ్రసంగించుచున్నారు.

వృథాదూఁకులు తూఁకుఁచున్నారు ఈదూఁకులు మాకేకాక మాశిష్యుఁడును సుప్రసిద్ధతర వద్దమున్నాటి వంశ్యుఁడును నగు నరసింహశర్మకుఁగూడ సంబంధించుచున్నవి. ఈబాలకవి అమాయకుఁడు నిజమాడనివారితనికి శత్రులు నిజమాడువారే మిత్రులు, ఇట్టి యితఁడు తమతోండదటపాటునుగని మందలించినందులకై యేవిధమయిన జవాబును గాని యీఁజాలక యేపోతరాజుగారినో అందుల కప్పగించి యేమో ప్రల్లదము లతనిచే వ్రాయించి అంతం దనివిసనక యితని కత్యావశ్యక బంధుసముద్రుఁడగు నొక ప్రసిద్ధోద్యోగి శిరోమణి నికటమున వారికిఁగల శాఖావాత్సల్యాతిశయమునూఁతఁ జేసికొని కాఁబోలు ననరానిమాటలాడినట్లు వారివల్లనే విన్నయీమాశిష్యుఁడు చెప్పి యక్కజపడఁజొచ్చినాఁడు, మొట్టమొదట మీాసములు, తలపెట్టి వ్రాసిన లేఖ మొదలు నేఁటివఱకును వీరొనర్చు పరిసంగమెల్లను శోచ్యస్థితిలోనేయున్నదని వ్రాయవలసివచ్చినందులకు విచారించుచున్నారము. గురుశుశ్రూష లేనిహేతువునఁ బూర్వోత్తర సందర్భము లెఱుఁగని వీరి యాశుకవితవలెనే వీరొనర్చు పరిసంగములును నుండుట యక్కజముకాదు వీరినెవరేని మందలించినచో నావాక్కులువీరికెక్కునే మోఁగానిమాహృదయమునవారుమిత్రులైనను, అదృష్టపిశాచన్యాయమున మమ్మువారు శత్రులుగాఁబ్రత్యక్షముగావ్యాసములలోలిఖించుచున్నప్పుడు మాయుపదేశమును వారెట్లు మన్నింపఁగలరు ఎఱుఁగ నేర్చినచో మాయమాయికత్వమే వీరికిఁ జెన్నపురిలోఁ బ్రాజ్ఞశిరోమణులచేఁ బ్రశంసాపత్రముల నిప్పించినదని ధ్రువపఱచవచ్చును ఈయంశమునకీ క్రింది యుదాహరణముకన్నను బ్రబలాధారము చూపుఁ డనువారలుందురా? చూడుఁడు.

చ॥ సరసకవీంద్ర సత్తములు సారవచోవిభ వాభిరాములౌ
తిరుపతి వేంకటేశ కవిధీరులమన్నన, గన్నమిమ్ము మే
మెఱిఁగి ప్రశంససేత జగమెల్ల నెఱింగినయట్ల విప్రశే
ఖరునకు జన్నిదంబిడుట కావున నేవిరమింతునింతటన్

[ఆంధ్ర ప్రకాశిక]

ఈపద్యమును రచించినవారు జగత్ప్రసిద్ధులగు చెన్నాప్రగ్గడ భానుమూర్తిపంతులవారు, వీరు కడు మంచిహృదయము కలవారు, ఎవరినేని మెచ్చుటయే వీరిముఖ్యోద్దేశము అట్టివారుకూడ సోదరులను మెచ్చుటలో భారమునువహింపక "పాపాలకెల్ల భైరవుఁ"డను సామెత న్యాయముపైఁ ద్రోసి వేసియున్నారు. దీనింబట్టిచూడఁ బ్రాజ్ఞులగు వారియుద్దేశము శ్రీ సోదరులింకను గొంతకాలము తి॥ వెం॥ కవు లెక్కడఁ గూర్చుండుమనిన నక్కడఁ గూర్చుండుచు వినయవిధేయతలు గలిగియుండవలసినదనియే కాని "టక్కాయి, బుక్కాయి, తాటికాయ లొట్టాయి" ధోరణికి దిగి "పుబ్బాముఖా" న్యాయమున కుదాహరణముగాఁ దపోయశము నర్పింపవలసినదని కాదు. ఈయంశమునకే యీ క్రింద నుదాహరింపఁబోవు శ్రీ సోదరుల మేనమామ కుమారుని హితోపదేశముకూడ బలకరమగుచున్నది.

"శ్రీమత్కొప్పరపు వెంకటసుబ్బరాయ రమణకవులనుగూర్చి"

ఉ॥ శ్రీయుతమూర్తులార? కవిశేఖరులార? మనీషులార? భ
ద్రాయితభూషలార? జనమాన్యమనోహరవేషులార? నే
నీయెడ వ్రాయుపద్యముల నేమి కొఱంతలు దీయకున్న చో
న్యాయము మేనమామకిలనందనుడన్ మరిగృష్ణయాఖ్యుడన్॥ 1

ముప్పంగ (శతావధానము మహాదివ్యంబుగా) జేయుచుఁ
బుల్ మఱిభూపులున్ నుతులమోఘుం బైతగఁ గాంచుచుఁ
త్సప్రచయంబుల్ గనిచో గుక్కిళ్లమింగించు వెం
బ్బాఖ్యసుధీమణీ సహజ వెంకట్రట్నకవ్యగ్రణీ॥ 2
ం మీరొనర్చు (యవధానశతంబుల) గూర్చునట్టి సు
ములు ధనంబు మఱిచేలములన్నియు మీరుగొన్న స
పలమైనమాకు సగభాగము దద్యశమబ్బు వంశదా
లు మీవలౌట మదికేమిగొరంతియు గానరాదిక॥ 3
కల్మి వారలును వీరలు దెల్పగ వింటి మీయశం
నాథుపూర్ణకృపనందిన మీకిలసాటిలేరు ఘా
వొక్కవిన్నపము దెల్పిన న్నాగ్రహమొందబోకుడీ
మాతులాత్మజమనీష స్వతంత్రముగొంటిగావునఁ॥ 4
యుగ్మమును దెగడుదంట కవీంద్రులుమీర లిర్వు రా
వెంకటేశ్వర సుధీమణు లిద్దరుగూడి కీరితిఁ
న నాల్గుదేశముల నింప దలంపక మీరు వారలుఁ
ప్పికయింతబూనక నిరోగులు వైదికులంచు మాయుదరః
విరోధులైతి రిది యందరకుఁ గడబద్ధమాయె సూ" 5
వధాన మీయెవని బారెను మున్నుగ, దాన నెల్లరుఁ
త సత్కవీశ్వరులు వారలె బండితులంచు బల్కరా
కారు కారనిన నుర్విని దప్పనిపించు గావునఁ
ము వాటు క్షీరములు నీరములుం బలె నున్నగాధుఁ॥" 6
ద్యాతిశయంబున్నయెడ జెప్పకనిప్పత్వంబు లెన్నం బనిలేదు
ట్లు వ్రాయనైనది.

పోతరాజు కృష్ణయ్య.

పైపద్యములు మేము వేమవరాగ్రహారావధానమునకు సేగి "గుంటూరిసీమను, వినిపించుపట్టున శ్రోతలలో నొకఁడగు శ్రీకృష్ణయ్య గారు స్వయముగా మాకొసఁగి తామిప్పుడు చూడనక్కఱలేదు తమచి త్తమునచ్చినప్పుడు చూచి గ్రహింపఁదగినవిగాఁ దోఁచినచో గ్రహింపుఁడు లేదా త్యజింపుఁడు" అని నుడివిరి. మేమిందు వారివ్రాఁతను "మక్కికి మక్కిగా గ్రహించుటచేఁ గొన్నితప్పులు గన్పట్టెడిని. కుండలీకరణము 2 చోట్ల కారణాంతరమున నుంచితిమి. దానికిఁగారణము రహస్యవేదులు తెలిసికొనఁగలరు శ్రీ సోదరుల పితృవంశమునఁగవితాధార యున్నట్లు వినము మాతామహవంశము పోతరాజువారు, వారేతప్పుల తోడనైన నేమి కవిత్వము చెప్పనలవాటుగలవారని నిర్ణయింపఁదగిన యాధారము లనేకములు గానవచ్చుచున్నవి. వారిలో ననేకు లీసోదరులు ప్రకృత మొనర్చుచున్న యవ్యక్తపుఁబనులకు సేవపడువారే యని చెప్పవచ్చునుగాని గుంటూరిసీమ పీఠికలో 15వ పుటలో నుదాహరించిన శ్రీపోతరాజుగారు మాత్రము కారణాంతరమున సోదరులు నడుపుచున్న పాపపుబండిని వెనుకనుండి త్రోయవలసినవారుగా నున్నారు. ఈపోతరాజుగారు కడునేర్పుగా నసత్యములు వ్రాయఁగలరు. పీరిపాండిత్యము 1913 సం॥ 3-4, సంచికలు మనోరంజని చూచినచో స్పష్టపడును, అవకాశమున్నచో నామనోరంజని పైఁ బ్రాహ్మణులు వ్రాసిన యభిప్రాయములను ఈవేమవరాగ్రహార శతావధానము తుట్టతుద నుదాహరించెదము. ఈయన తి॥ వెం॥ కవులకు, శ్రీమచ్ఛబ్ద ద్వితీయైకవచనము, శ్రీవంతం అగునని యే తెలియును గాని "శ్రీమంతం" అగునను జ్ఞానముకూడ లేదనుసాహసులలోనివారు ఈయన వ్రాఁతను గనుల నద్దికొని పత్రికలోఁ జేర్చికొను కాళ్లకురిరావు

బరఁగెడు మిమ్ముఁబోలఁగల పాటివరుండొకఁడుండ నేర్చునే
బిరబిరవచ్చెముల్ జరుపఁ బెద్దతనంబది యెట్టులబ్బెడున్ ॥
సరియనలక్షణంబటఁ బ్రశస్తముగాఁగనుపింపవచ్చె? సా
దరమున మిత్రబాంధవులు తద్దయు మిన్నగఁజూచినంతనే
గరువముఁజెంది నాకిఁకను జోత్రతలేఁ దుల్యుఁడు లేఁడటంచుఁ దాఁ
బరిపరిసంతసింపినను బండితవర్యులు మెచ్చవచ్చె? పా
మరులొకకొందఱట్టులనె బాగని పల్కినయంతమాత్రనే
తిరమగు మీయశమ్మునకు దీటగునే? మఱి లోఁగల్గునే?
తిరుపతి వేంకటేశ్వరులె తిర్పతి వేంకటశాస్త్రియుగ్మమై
వఱలెడువట్టిఁగల్ల యది వారలకీగల లెక్క యేటికిన్ ॥

శా॥ చండప్రచండదీప్తిమెయి సప్తహయుం డటు వెల్గువేళనే
రండయొ సూర్యమొక్కఁడు కరమ్మునఁదాల్చియు నడ్డువెట్ట జ్యో
మండలికెల్లఁగమ్మునె తమమ్మది? భాస్కరుకడ్డుగల్గునే?
నిండె జగమ్మునం దమదునిర్మలసుస్థిరకీర్తివ్యాప్తిమైఁ
గండబలంబునంగనలి కాలునుద్రవ్వినయంత నల్పులున్
మొండుమగంటిమిన్ మెఱసి మిమ్ముచుదారొకనఁగల్గనేర్తురే?
దండియశమ్మునకు న్సొగులఁ దక్కవగల్గునె? యున్నియేల? మీ
రుండినచోటనుండుటకు యుక్తులుగారని చెప్ప నొప్పగున్ ॥

ఉ॥ భూరమణుల్ ముదంపడఁగ ముష్కరపండితులెల్ల భీరులై
పాఱ శతావధానములఁ బార్థివసత్సభలందొనర్చి బల్
పేరువహించియున్ మఱియు వేమరుహారములం గ్రహించి మీ
కేర్తికఁదుల్యులంచనఁగ నెంతయు దిగ్జయమందినారు ప
ల్మాఱు స్తుతింపనేరనిదె భక్తినొనర్చెద వందనంబులన్ ॥

ఉ॥ భారతగ్రంథముం బలెనె పావనమై రసవంతమై మహో
దారగుణాకరంబయి సదా నరకోటికి నీతిబోధకున్
గారణమై ఘనంబగున కావ్యమునై వెలుఁగొందుచున్న మీ
గీరతగ్రంథమొక్కటియె గీటడఁగింపఁగఁజాలు దుష్టులన్ ॥

చ॥ సరసగతిం బ్రబంధములు చాలరచించియు నాంధ్రభాష ని
ద్ధరణిని వృద్ధిఁజేసిరి పదంపడిఁగొందఱుఁజేసి గొప్పగన్
నిరుపమశాబ్దికోత్తరుల, నిర్జితశత్రులఁజేయుమింక మా
తిరుపతి వేంకటేశకవిధీరులఁ దిర్పతి వేంకటేశ్వరా ॥

చ॥ పరులనియెంచఁబోకు మది భావ్యముగాదది నీదు తేజమే
ధరణిని శోభఁజెందెడిని దాననె వారలకిష్టసౌఖ్యముల్
అరయఁగ నీవెగాన నిఁక నన్నిఁట నెంతయుఁ బెద్దసేయు మా
తిరుపతి వేంకటేశకవిధీరులఁ దిర్పతి వేంకటేశ్వరా ॥

చ॥ ధరణి శతావధానమను దారినిఁజూపియు వెల్లడించి యా
సరణి ననేకదేశములసంచరియించియుఁ గొంతమందికిన్
విరచనసేయనేర్పి యవివేకితమాన్పి శ్రద్ధఁజూపు మా
తిరుపతి వేంకటేశకవిధీరులఁ దిర్పతి వేంకటేశ్వరా ॥

గీ॥ నర్సరాట్పురి మిమ్మొకనాఁడుగాంచి
నాఁడు మొదలు కవిత్వంబు నాకుఁదోఁచి
నట్టిలల్లఁగఁబూనితిఁ బట్టువిడక
నేఁడు నట్టులె వ్రాసితి నిక్కమిదియె ॥

మ॥ తమదాదర్శనలాభమబ్బుటనె యేతన్మాత్రమున్ వ్రాసితిన్
మిముదర్శించుటదక్క నన్యమెఱుఁగన్ బెక్కేల వేరొక్కగ్రం
థముఁజూడంగను లేదు తప్పులకునై నన్నింతమన్నింపఁగన్
మిముఁబ్రార్థించెద నాదరింపుఁడు ననున్ మీశిష్యశిష్యుండనే ॥

అయ్యా,

శ్రీవేమవర శతావధానమున మీము సందర్శించినవారలలో నేనొక్కరుఁడ, ఆసమయమున నే నలుపురతోఁపాటు తోఁచినంత వఱకుఁ బద్యములను వ్రాసి నమస్కరించుటకు నాదురదృష్టమున దేహము కొంచెమస్వస్థతగానుంటచే నట్లొనరింపఁజాలనైతి. నాపై ననుగ్రహించి యీనానమస్కారపూర్వకముగాఁ బంపుకొన్న పద్యములను గ్రహించి తప్పులనుక్షమించి నన్నుఁ గృతార్థుఁడనుగాఁ జేయుదురని దృఢవిశ్చయుఁడనై యిట్లుపంపుకొన్నాఁడను

ఇట్లు, దీపాలపిచ్చయ్య,
విద్యార్థి, వినకొండ.

ఉ॥ ఓకవివర్యులార! భవదుత్తరసాస్వదహృద్యపద్య వ
ర్షాకలనన్ స్వపక్షములు హానినిజెందిన భీతిఁజెందుచున్
గాకవి హంసలయ్యెయొ? చికాకయిపోయెఁగదా? యధోగతిన్
గీకులు దూఁకులుంజెడె యొగిన్ గనుగొల్కులనీరునించుచున్ ॥ ౧

ఉ॥ లోకమునెల్లెడన్ గుకవిలోక మహామదవల్లులల్లఁ జీ
కాకుగ, వానినెల్లనఱుకన్ భవదంబధరించినట్టి శా
తాకృతిఖడ్గయుగ్మమన నాదటనొప్పెడి మీదుమీసముల్
బ్రాకటసద్యశోవిజయభద్రము లెల్లెడనొందుఁ గావుతన్ ॥ ౨ ॥

చ॥ సరసిజగర్భులంచు మతిచాకచకిన్ గురులంచువిద్యలన్
నిరుపమనీతిఁగావ్యులని సిచ్చులుసర్వకవీశ్వరుల్ నుతిం
త్రరయ "నిరంకుశాఃకవయ" యంచనిసైఁచుటెకాని పూజ్యులౌ
తిరుపతివేంకటేశ్వరుల దీటువహింపఁగలారె యేరునున్ ॥ 3 ॥

సీ॥ శ్రీసార్వభౌముల చెంతఁబద్యములుగు
ప్పించినా ర్వారి మెప్పింపినారు
శతవధానమ్ములు చక్కఁగా వేల్వేలు
చేసినా ర్జయభేరి వేసినారు
లోకకాకవిలోక పాకమ్ములను గాల
రాచినార్విజయు లైతోఁచినారు
అగ్రహారాన ర్ఘహారాది బహుమతు
లంది నార్చాలఁ బెంపొందినారు,

తే॥ గీ॥ సద్యశమ్ముచు భువి వెదఁజల్లినారు
దివ్యమోదాబ్ధి విబుధులఁ దేల్చినారు
గానతిరుపతి వేంకటాఖ్య కవిమణుల
నెన్నఁగాఁదరమౌనె వాణీసుతకైన ॥ ౮ ॥

☞ [చేవ్రాలుగల తుట్టతుది కాగితము కనుపట్టలేదు కావున
నీపద్యములువ్రాసినవారు తమ పేరును దెలుపఁ బ్రార్థింపఁ
బడుచున్నారు పునర్ముద్రణమున సవరింపఁబడును]

చ॥ నిరుపమసాహితీగరిమ నేర్పుగ మీానముఖాన నేర్చి వే
లురి శివరామశాస్త్రి జనలోకముమెచ్చఁగ సుబ్బరాయశా
స్త్రిరమణనిర్వురుఁ దగసుధీసుతులు మెచ్చశతావధానముల్
గరమునొనర్పసాగిరి వికస్వర సుస్వర భాస్వరమ్ముగన్ ॥ ౧ ॥
[వ్రా లుకనుపట్టలేదు]

శ్రీవాసుదేవపరబ్రహ్మణేనమః

చ॥ సరళతుషారభూమిధరజాసువిశేషదయాతిపైదుషీ
తరళనిరర్గళాశుకవితావనితాపరిరంభజృంభణో

అయ్యా,

శ్రీవేమవర శతావధానమున మిము సందర్శించినవారలలో నేనొక్కరుఁడ, ఆసమయమున నే నలుపురతోపాటు తోఁచినంతవఱకుఁ బద్యములను వ్రాసి నమస్కరించుటకు నాదురదృష్టమున దేహము కొంచెమస్వస్థతగానుంటచే నట్లొనరింపఁజాలనైతి నాపై ననుగ్రహించి యీనానమస్కారపూర్వకముగాఁ బంపుకొన్న పద్యములను గ్రహించి తప్పులనుక్షమించి నన్నుఁ గృతార్థుఁడనుగాఁ జేయుదురని దృఢనిశ్చయుఁడనై యిట్లుపంపుకొన్నాఁడను

ఇట్లు, దీపాలపిచ్చయ్య,
విద్యార్థి, వినకొండ.

ఉ॥ ఓకవివర్యులార! భవదుత్తరసాస్పదహృద్యపద్య వ
ర్షాకలనన్ స్వపక్షములు హానినిజెందిన భీతిఁజెందుచున్
గాకవి హంసలయ్యెయొ? చికాకయిపోయెఁగదా? యధోగతిన్
గీకులు దూఁకులుంజెడి యొగిన్ గనుగొల్కులనీరునించుచున్ ॥ ౧

ఉ॥ లోకమునెల్లెడన్ గుకవిలోక మహానుదవల్లులల్లఁ
గాకుగ, వానినెల్లనఱుకన్ భవదంబధరించినట్టి శా
తాకృతిఖడ్గయుగ్మమన నాదటనొప్పెడి మీదుమీసముల్
ప్రాకటసద్యశోవిజయభద్రము లెల్లెడనొందుఁ గావుతన్ ॥ ౨ ॥

చ॥ సరసిజగర్భులంచు మతిచాకచకిన్ గురులంచువిద్యలన్
నిరుపమనీతిఁగావ్యులని నిచ్చలుసర్వకవీశ్వరుల్ నుతిం
త్రరయ "నిరంకుశాఃకవయ" యంచనిసైఁచుటెకాని పూజ్యులౌ
తిరుపతివేంకటేశ్వరుల దీటువహింపఁగలారె యేరునున్ ॥ 3 ॥

సీ॥ శ్రీసార్వభౌముల చెంతఁబద్యములుగు
ప్పించినార్వారి మెప్పించినారు
శతవధానమ్ములు చక్కఁగావేల్వేలు
చేసినా ర్జయభేరి వేసినారు
లోకకాకవిలోక పాకమ్ములను గాల
రాచినార్విజయుల్తెతోఁచినారు
అగ్రహారాన ర్ఘహారాది బహుమతు
లంది నార్చాలఁ బెంపొందినారు,

తే॥ గీ॥ సద్యశమ్మును భువి వెదఁజల్లినారు
దివ్యమోదాబ్ధి విబుధులఁ దేల్చినారు
గానతిరుపతి వేంకటాఖ్య కవిమణుల
నెన్నఁగాఁదరమా నె వాణీసుతైన ॥ ౪ ॥

☞ [చేవ్రాలుగల తుట్టతుదికాగితము కనుపట్టలేదు కావున నీపద్యములువ్రాసినవారు తమపేరుతు దెలుపఁ బ్రార్థింపఁ బడుచున్నారు పునర్ముద్రణమున సవరింపఁబడును]

చ॥ నిరుపమసాహితీగరిమ నేర్పుగ మీసముఖాన నేర్చి వే
లూరి శివరామశాస్త్రి జనలోకముమెచ్చఁగ సుబ్బరాయశా
స్త్రిరమణనిర్వరుల్ దగసుధీసుతులు మెచ్చశతావధానముల్
గరమునొనర్సపాగిరి వికస్వర సుస్వర భాస్వరమ్ముగన్ ॥ ౧ ॥
[వ్రాలుకన్పట్టలేదు

శ్రీవాసుదేవపరబ్రహ్మణేనమః

చ॥ సరళతుషారభూమిధరజానువిశేషదయాతి పెదుషీ
తరళనిరర్గళాశుకవితావనితాపరిరంభజృంభణో

త్రప్రతిభాసము జ్జ్వల వధాన విధాననిధానులైన శ్రీ
తిరుపతివేంకటేశ్వర సుధీమణులన్ బ్రణుతింతునిచ్చలున్ ॥ ౧ ॥

ఉ॥ అన్నెలకై చకోరము లహర్నిశముం దపియించురీతిగాఁ
బన్నగభక్తి మీదుపదపద్మములన్ గడుఁ జేర్మిఁ గొల్చు చిం
కెన్నఁడిఁ కెన్నఁడో యనుచు నెంతయుఁ గోరిక లూరుచుండుమా
పున్నెము నేఁటికిన్ ఫలముఁ బొందిమిమిమ్ముంగనుభాగ్య మబ్బెడిన్ ॥ ౨

ఉ॥ కమ్మఁదనమ్ము నించి బుధకల్పిత శ్లాఘసువృత్తబాధకా
వ్యమ్ములమించి ధారణ నెబాసనిపించి సువాక్సుధాప్రవా
హమ్ముజనించి కాకవిజనాళి కృతంబుహసించి మీవధా
నమ్ముజనమ్ము కిమ్ముగ మనమ్ముముదమ్మునుగ్రమ్మఁ జేసెడిన్ ॥ 3

సీ॥ పర్వదినమ్ములఁ బ్రాథోధి రంగదు
త్తుంగ భంగములనుప్పొంగురీతి
భండనమందర్జునుండు గాండివ ముక్త
చండ కాండము లంపుచుండుభాతి
దితిసుతనుతుఁడు స్వాతీగతుండై క్షితి
యతులితాసార సంగతమగుగతి
శితికంఠజూటనిర్గతవిమిర్మలసుధా
రసయుతత్రిభవ నిర్ఝరిణిశీకరణి ॥

తే॥ గీ॥ సరససారసుబంధబంధుర సువృత
కలితమ్ము మధురలెరాశు కవనధార
సదయనువిస్మయాఢ్యతేఁ జేసెందిఁ జేయు
మీకుసములెవ్వరిఁక మీకు మీరె కాక ॥ ౪

చ॥ గఱిగఱికన్ బరోక్షమునఁ గాఱుల్ ప్రేలనెగాని దంభభూ
భరదరులందుడాఁగుకుకు పాతకుల్ జపలప్రచార సో
దరులును దుర్మార్గచయదర్శితరాములు నెందఱైన శ్రీ
తిరుపతివేంకటేశ్వర సుధీశులఁబోలఁ సముఁబాదురే భువిన్ ॥ ౫ ॥

చ॥ కవులన నందఱుంగవులు గాఁగలరే? రచియించియుండిరే
నవరసపూరితంబులగు నవ్యకథల్ మిముఁబోలె నందుఁ బాం
డవవిజయంబుఁబోలఁ దగునాటకరాజము మూఁడువేళలం
దు వెడలునే? మఱొక్కరికిఁ దోఁచునె యయ్యసమానధారయున్

తే॥ గీ॥ ఓమహాత్ములార? మహోన్నతమగు
మీావధానవిధానం బమేయముగను
గలుగఁజేసినమోదంబు నిలుపలేక
పద్యములనిట్లు వెల్లడిపఱిచినాఁడ
వచ్చియును రాని బిడ్డలపల్కులకును
దల్లిదండ్రులుమిగుల సంతసపడుక్రియఁ
దప్పులున్నను మీారుపుడుదారమతిని
ఆశ్రితుఁడ శిష్యసముఁడ జంధ్యాలవంశ
వనధిశశిని సుబ్రహ్మణ్య మనెడువాఁడ ॥ ౬ ॥

ఇట్లు భవదాశ్రితుఁడు
జంధ్యాల చిన్నసుబ్రహ్మణ్యశాస్త్రి

చ॥ ఘనతనుమీాఱ బందకునఁగాలముఁబుచ్చుచుఁ బారశాలనే
దినమునకొక్కభంగి గురుధీవరులైకడున్వృద్ధిఁజేయుచున్
మన మలరంగబాలురకు మాంద్యముఁబాపి పదార్థజాలమున్
దనుపుమరట్టివాదికట ధైర్యముగాదొకొ మీారలుండుటల్ ॥ ౧ ॥

ఉ॥ సారముగాదు ప్రస్తుతవిచక్షణ వర్యకవిత్వమంచుఁ దా
నీరసభావమొంది స్తవనీయులఁ దిర్పతివేంకటేశులన్
ధీరులటంచు లోఁదలఁచినీవిఢ్డైన భవాని వీరివా
గ్ధోరణియందు నృత్యము నకుంఠితలీలలఁ జేయుచుండెడున్ ॥ ౨ ॥

ఉ॥ అందముమీఱుమీఁదు కవితాతిశయమ్మును విన్నమాత్రనే
యందఱిమానసమ్ములహహా యనిసంతసమందుచుండు మా
కందదెయిట్టిపోకయహహా యనికొందఱు నిట్టికార్యముల్
వందలువేలకైనఁ గొనబాగుగదాయనిచెప్పువారలున్ ॥ 3 ॥

(ఇంకను గొన్నికలవు. చేవ్రాలుకన్పట్టదు)

శ్రీమేధాదక్షిణామూర్త్యైనమః

—♦ ప్రార్థన ♦—

ఉ॥ శ్రీకరభాగ్యభోగ్యము లశేషకలావిభవంబులున్ స్వసే
వాకరణప్రవీణలయి వార్థిసుతావిధివల్లభల్ స్వధ
ర్మాకలనందనర్పజనకాగత హైమవతీత్వమర్థయు
క్తాకృతినొప్ప భక్తశిశిరార్థదయైన భవానిగొల్చెదన్ ॥

నవరత్నములు

ఉ॥ వేమవరాగ్రహారమున విశ్రుతజాతిగుణక్రియుల్ గలా
శ్రీమతులాగ్రహారికులు చిత్రము తిర్పతివేంకటేశ్వరా
ఖ్యామహనీయ సత్కవికృతాంచితరీతి శతావధాన మా
పామరపండిత ప్రమదపాత్ర మదిట్టులొనర్పఁబూనుటల్ ॥

చ॥ తిరుపతివేంకటేశుఁడను దేవుఁడు శేషమహీధరంబునన్
జిరముగనుండివేరొక విశిష్టగతిన్ నటియింపఁగోరి భా

సురనిజశక్తిలీల్ల నభిజ్ఞోభిత్తుగ్గడై భువినిమ్మహాకవీ
శ్వరయుగళాకృతిక్షెవెలసెన తత్త్వమహత్త్వము లిట్టులుండునే॥

శా॥ ఆవాచాలత యాకవిత్వగరిమం బాప్రౌఢ వాధాన్య మీ
ధీవైదగ్ధ్యము నాసమస్ఫురణ మాదివ్యప్రబంధ్యాను బం
ధావిర్భూతశ్రవచక్షపటిష్ఠతయు నాహా! యద్వితీయంబు స
ద్భావుల్ తిర్పతివేంకటేశ్వరకవుల్ తామెట్టు ప్రాపించిరో!

చ॥ ఘనతర్కమ్మున్నిట్టి మహిమంబులు గంటిమె వింటిమె వధా
నవమహోత్సవం బట్టునన్ గబ్బిది కాశియొ రామనాథమో
వినుతిర్ణక్ష్మీంద్ర శ్రీనిధియొ వింతగు కంచియొ కాళహస్తియో
ననుమును చూడనిమ్ము జనశ్రుతి మ్రోగెడలన్ విశంబనున్॥

ఉ॥ ఇక్షుఫలంబు హాటక సమృద్ధ సుగంధము పూర్ణచంద్రని
ర్లక్షణభావమీ కవివరద్వయుల్ శతావధానముం
దక్షులు నాగ్రహారికులు దద్విధిసాధకు లౌటనిక్కమే
సాక్షి రయుక్తిగాదు దలఁపన్ బరిశీలనబుద్ధి జూడఁడీ॥

శా॥ పాండిత్యంబును కావ్యకల్పనయు వాక్ప్రాగల్భ్యమున్నార్ద్రవా
ఖండస్ఫూర్జిత శబ్దగుంఫనయు నగ్రామ్యాభినవ్యగ్రథా
చండప్రజ్ఞయు నొక్కచోటఁ బరికించన్ లేవవింకుండెడి బ్ర
హ్మాండంబంతయు శోధితంబగును సామ్యాభావమే వీరికిన్॥

చ॥ ఇదియొక యద్భుతం బిరువు రేకకృతాభినివేశులౌట స
మ్మదమున నాగ్రహారికసమంజస దిగ్గజముల్ ద్వయీకవి
త్రిదశపసింహముల్ మిగులఁ దేజముగల్గినవం ననుండెడ ని
ట్లదిసుఖమైకమత్యమని యెల్లరకున్ దగబోధ నిచ్చుచున్॥

శా॥ కాళిదాసుఁడు దండిశంకరులు మాఘప్రఖ్యుఁడన్యుల్ కవుల్
కాళీదేవి ప్రసన్నతంగనిరి విఖ్యాతిం బ్రబంధంబులన్
కేళీరూపసరస్వతీత్వము లసద్గీర్భర్త్స్న చాతుర్యమో
వేళాపాళులు లేక స్వైరకృతులీ విద్వత్కవుల్ సెప్పెదర్ ॥

శా॥ భాషాతద్విభులున్ రమాతదధిపుల్ భాస్వత్సతీతత్పతు
ల్భాషాగణ్యశచీతదీశులు విలంబప్రస్ఫురత్సర్వ స
ద్భాషాశ్రీలు సహాగ్రహారిక కవిద్వంద్వంబుకున్ గూర్త్రిమ
ద్భాషాపోషితులై యటంచనిశమున్ ధ్యానించెదన్ వారలన్ ॥

రామడ్గు వెంకయ్యశాస్త్రి

సభముగించునప్పుడు చెప్పినది.

చ॥ జననపులగ్నమందలరు శక్రగురుండును శుక్రుఁడున్ గుజుం
డును నలరాహువున్ ననుఘనుంబొనరించెడినంతె కాని యే
నును నొకసత్కవీశ్వరుఁడనో "తిరప"య్యయునొక్కమేటి యో
యనఘకవిగ్రహంబులు గ్రహంబులుగవ్వను జేయువజ్రమున్ ॥ 1

ఊరేగింపున కించుక పూర్వముజరిగిన విద్యాప్రసంగానంతరము సత్కృతులైన ప్రకృతకవులు చెప్పినవి.

సీ॥ మరల నెప్పుడు మీరు మాకు లభింతురో
వందనంబయ్యా? విద్వాంసులార?
మంచిపద్యములు క్రమ్మఱ వినుకొన్నఁడో
జోహారులయ్యా? యోసుకవులార
కన్నులుచల్లఁగాఁగాంచు టేనాఁటికో
మీకుఁ బ్రణామముల్ మిత్రులార?
మరల నెన్నఁడుకనంబడును మీకన్నీరు
మీకుమంగళమోయమిత్రులార?

తే॥ గీ॥ మరలమాచేత శారదమాన్యచరిత
ఉరక మెన్నఁడు చేయించునో? శతావ
ధానమా? దివ్యకీర్తి ప్రధావిధాప్ర
ధానమా? నీకుఁగూడ వందనములమ్మ॥

సీ॥ విశ్వజనీనుండు వితతభాగ్యుండు భా
గ్యస్వహాయుండు చెన్నయ్యగారు
పరమసాధువు మెళ్ళచెఱువు వంశాంభోధి
చంద్రముఁడైన శేషయ్యగారు
యజ్ఞోపవీతాన్వయాంభోధి కబ్జుండు
వేంకటాచలపతి వితతయశుఁడు
భాగి వంశ్యుండు వెంపటివారికిం దత్తుఁ
డైన వెంకటసుబ్బయార్యవరుఁడు

తే॥ గీ॥ అశ్వమేధంబొ? రాజసూయంబొ సత్ర
యాగమో నాఁగ నవధానములవఱిచిరి
సాటి వెల్నాఁటివారును సాటిలేని
వారు వారికిఁగూడ నావందనములు॥

తి॥ శా॥

తే॥ గీ॥ ఇతరశాఖయటంచు లోసించుకేని
భేదమెన్నక ననుఁదద్దఁ బేర్మిఁజూచి
గౌరవించిన మిమ్మెన్నఁగలనె యేను
సర్వసములారా? వెల్నాటిచతురులారా?

(వడ్లమన్నాటి నరసింహము, పింగళి లక్ష్మీకాంతము, జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రియునను శిష్యులుచేసిన ప్రసంగానంతరము చెప్పినది)

చ॥ తిరుపతియేన్గుగాఁగ గడిదేఱిన శిష్యులనేకు లొప్పుమైఁ
బొరిఁబొరి రోజుచుఁ దనదుపొంతను బెబ్బులిపిల్లలట్లు చూ
ఁపులులకుఁదోఁపఁగేల నొకపాటిగి బెత్తముఁబూని వేంకటే
శ్వరుఁడు శతావధానమను "సర్కసు"ఁజూపెడిఁ జూడుఁడో బుధుల్॥

వెం॥ శా॥

చ॥ తిరుపతివ్యాఘ్రమై బయలుదేఱిన శిష్యులుగున్న యేన్గులై
వఱలఁగఁదేఱఁగాఁదగినవారలు బెబ్బులిపిల్ల లెల్లమా
ర్తురు కపికుక్కురమ్ములయితోఁపఁగ వేంకటశాస్త్రిపిరకే
సరిగ శతావధానమను "సర్కసు"చూపితివమ్మ శాంకరీ॥ 1

తి॥ శా॥

బ్రహ్మరథోత్సవానంతరము చెప్పినపద్యము.

సీ॥ కాసుచొప్పున నింతగా నార్జనముచేసి
తెంతఁ దెచ్చినను మాకింత లేదు
గడగడలాడినఁ గానఁగా నే తెంత్రు
గానఁబోయిన మమ్ముఁగాంచుటరిది
ప్రీతితో నీకునర్పింతురెంతైన మా
కింతయిచ్చియు నెంతురెంతొ యనుచు
సేవించి నీకు వాంఛితములిత్తురు సేవ
గావించినను మాకుఁగాసునీరు

తే॥ గీ॥ అనుచు మును పెన్నఁడో యాడినట్టిమాట
కన్యథాత్వంబుఁగూర్చి సిగ్గందఁజేసె
తైన నేమయ్యె నీయుత్సవాదికమ్ము
వీవకైకొమ్మ? యోవెంకటేశదేవ॥ 1

వేమవరమునుండి బయలుదేఱునప్పుడు చెప్పినవి

ఉ॥ కాశికనుండి యొండెడకుఁగాల్గదలింపనివానిఁ గాశివి
శ్వేశుని దెచ్చి యొక్కమెడ నింటికిదాపుననిల్పె సద్యశో
రాశి భవత్పితామహుఁడు ప్రాజ్ఞుఁడు, తిర్పతివేంకటేశ సూ
రీశుల నీవు తెచ్చుటది యేమి విశేషము చెన్నయాగ్రణీ॥ 1

వెం॥ శా॥

ఉ॥ ఎవ్వరు నిగ్రహించిరో బుధేంద్రులు రాజులయొద్ద వారిపే
రివ్వసుధన్ జెలంగునటు లెంతయు నోమిన చెన్నయాదులం
దెవ్విధినేనిఁ బేర్మిభరియించుచు మేల్ సిరిసింపుమమ్మ వసా
యవ్వరొ? యింక మాకు సెలవా! యల వేమవరాగ్రహారమా॥ 1

తి॥ శా॥

శ్రోవలో ననుభవపూర్వకముగాఁ దోఁచిన కల్పనలు.

సీ॥ ఎక్కించితివిగదా? యేగుచో మేనాల
సత్వతస్సమవ్యాప్తి సంకులముగ
పట్టించితివిగదా బ్రహ్మరథముఁ గూడ
స్వస్తివాచనపురస్సరముగాఁగ
కల్పించితివిగదా గాఢోత్సవమ్ముల
వారాంగనాకదంబములతోడ
తాల్పించితివికదా? తలలపైఁ బాదర
జంబు నాబాలవృద్ధంబుగాఁగ

తే॥ గీ॥ సురభిమానగ్రహావేశ ధూమధూపి
తాప్రయోజక గర్తపురాంతరస్థి
తాత్మపద్ధతిపఙ్క్తిను మాంఘ్రిసూజన
సంకలిత నిత్యమూర్ఛ? ఆసనపుఁజర్చ॥ 1

పాదరక్షలు దాల్పంగవలయు నీదు
విధమెఱింగినాము రమా కొండవీటిసీమ॥ 1

తి॥ శా॥

శ్రోవలోని యెల్లమంద గ్రామవాసులును బూర్వపరిచితులును నగు శ్రీ వల్లూరి రాజకవిగారు లోనగువారు సగౌరవముగాఁ గోరిన కల్పనమీఁదఁ జెప్పినపద్యము

మ॥ అలవాఁ రాణాశనుండు దేవుఁడు కులుంబామడు
బులకుం దాళఁగలేక నెమ్మనమునన్ బొల్పారు రాగాంకురం
బుల నిర్మాణము చేసివచ్చి యిచటన్ బుణ్యస్థలంబాత్రిశృం
గల సత్పర్వతమందు నిల్చెనొకొ యేకాకిత్వ మేపారఁగన్॥ 1

వెం॥ శా॥

నర్సారావుపేటలోని సభ్యులకోరికపై మాశిష్యుఁడు అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి చెప్పిన యత్యాశుకవిత్వానంతరము చెప్పినపద్యము.

చ॥ ప్రకటతరాశుధారను సభాసదులందఱు మెచ్చుచుండ నా
యకమణిసంతసింపఁగ నయారె ? రచించినవాఁడవీవు వా
రకయరవిందసుందర మరందఝరంబు స్రవించుచుండునీ
సుకవితగాచుకోఁగదవె సుబ్బనశాస్త్రి జగద్ధితంబుగన్॥

తి॥ శా॥

గద్య
ఇది శ్రీ తిరుపతి వెంకటేశ్వర విరచితంబగు
వేమవరాగ్రహార శతావధానము

సమాప్తము

శ్రీ శ్రీ శ్రీ

ఇందుమతీ పరిణయము



ధరణీతలంబురంగవల్లి కాలంకృతంబగు మెఱుంగు హొరంగుమీఱఁ దరుణారుణబింబడంబ
విడంబిదాడిమీకుసుమ విసరలసదసమవిస్ఫురర ప్రభావిభవంబు శోణాంబర ప్రకల్పిత
వితాన వితానంబై తనరఁ బచేళిమ లికుచమాలూర ఫలకుచాభిరామ తత్తల్లతాంగీకిస
యచలత్కరాభినయమరుత్ప్రపూరిత కీచకరంధ్రస్వనగానంబులు వెలయ గతాగతశు
కాంగనావారంబు కలకంఠీకలకంఠికలకాహ్వానం బొనర్చుచువాసీనులబృందంబు వం
దంబు నందంబు నందంబు నొంది వికీర్ణశాఖిశాఖాచలచ్చూతక్షిప్త జాలకజాలంబు లా
జాతకుతనికరంబుచందంబు నొందఁ జంపకజపాబంధుజీవపాళికలు ప్రదీపకళికలపోలికం
గీలుకొన నందంద మందమందమరుచ్చలాచలసరస్థల బద్ధసౌగంధ్యబంధురప్రోన్నమత్పు
ష్పంధయస్తనంధయస్తోమంబు హోమధూమంబుగోమున నెసంగ సకలద్విజారవసమృ
ద్ధంబై యవ్వసంతసమయంబు నిఖిలజగన్మోహం బయ్యె నయ్యెడ॥

మ॥ ఒకనాఁ డారఘురాజనందనుఁడు ఖద్యోతప్రభాచాకచ
క్యకనత్కాంచనరత్నదీధితులఁ జెన్నౌ కొల్వుకూటంబునన్
సుకవుల్ మంత్రితతుల్ పురోహితులు రాజుల్ భక్తితోఁ గొల్వఁగాఁ
బ్రకటప్రౌఢిమ మీఱ రాజస మెలర్ప న్నిండుగొల్వొప్పఁగన్॥ 45

ఉ॥ మిక్కిలినల్పదేఱుబలు మేనులు జుంజురుగడ్డముల్ సికల్
చక్కనియంపకోలలు భుజంబులపై నెలవింటిబద్దలున్
గ్రిక్కిఱియంగ వైచుగురిగింజసరాల్ నెమలీఁకలున్ జెవిన్
జెక్కినకొండగోఁగువిరిచిన్నెలు వన్నెలు చూప నెంతయున్॥ 46

చ॥ కటిని బిగించి కట్టిన చొకాటపుగాటపుఁబారుటాకుదు
ప్పటులబెడంగుతో నిటలపట్టుల జేగురుబిళ్లబొట్లతో
నటునిటు కొంతకొంత బెదు రందుచు దిక్కులఁ జూచుచూపుతో
నటవులనుండి చెంచుదొర లబ్బురపాటుగ గొందఱత్తఱిన్॥ 47

చ॥ కలరవశారికాశుకపికంబులు దివ్యమణుల్ మహౌషధుల్
పొలుపగుదంతముల్ పికిలిపూవులబంతులు తేనెకావడుల్
ఫలములు నక్కకొమ్ములును బచ్చనికప్రము చారపప్పు న
గ్గలముగ డేగగుంపులును గానికగా నిడి మ్రొక్కి మక్కువన్ 48

సీ॥ సామిసామి పరాకు చక్కనిరాచదొరయ్య దండాలు నీయడుగులకును
మీసల్లదనమున మాసెంచితలు మేము మాబిడ్డలను కాన మనెవమయ్య
కానలకోనలనానాట గరుచేరి పొట్టసాకెదమయ్య పుడమిఱేఁడ
యేటల తోటల యెటువంటిబలుమెకాలైనమాచేసిక్కునయ్య మీకు
గీ॥ దవుల నూసినయొక్కఁడు గవులఁబోవ నీకసింగము లైనను సెంచివైతు
రొకరికంటెనుయొకడుబలుక్కునకలందమానిన యోరాచచందమామ॥ 49

సీ॥ నూసినారము సామి? సుట్టుగట్టుల ఱేని సుట్టుఁ గల్గిన గొప్పగుట్టలెల్ల
గాసినారము రాజ కలశంబుబిడ్డఁడు క్రొవ్వడంచిన వింజకోనలెల్ల
మోఁగితి మెకిమీఁడ? మినుసిగదేవర మామగుబ్బలిసల్లసీమలెల్ల
తిరిగినామోయయ్య? ఱేఁగంటిసాముల పొందింపుసేఁతలబూములెల్ల
గీ॥ నందునందున మెకముల నబ్బురముగ నేసి యన్నింటి నొకదెబ్బ ధీసివార
మైన బలుజంతువుల నెక్కుడైనదొడ్డ కాన గల దొక్కజాడ రాకలుపఱేఁడ॥ 50

మ॥ పులులుం జింగములుం మదేభములుఁ గారోపేతుల్ కణంతుల్ శశం
బులు మన్బోతులు భల్లుకంబులును దుప్పుల్ పందు లిర్లేదుబం
దలు ఖడ్గంబులు కోర్ణగండుగురుపోతుల్ కొండగొఱ్ఱెల్ వరం
గులు సెండెండు గమంగొనంగ వనిలోఁ గ్రోటానకోటుల్ నృపా 51

గీ॥ చెట్టుచెట్టున బిట్టలు పుట్టకొలఁది నేతిముద్దలవంటివి దీటు మెపుడు
నురులు దవిలించి తడికాచాటొనరఁ జేసి దేవరకు డేగఁవేఁటాడఁ దెలుసు నచట 52

చ॥ అనుటయు రాజసూలి హృదయం బలరంగ వనేచరాళికిన్
ఘనము చెలంగఁ జాల బహుమాన మొనర్చుచు వేటకై చనన్
జనవరు లైనవారు రభసంబునఁ గొందఱు గొల్వ సాహిణిన్
గనుఁగొని తేజిఁ దెమ్మనుచు గ్రక్కున మక్కువఁ బల్కె నంతటన్. 53

సీ॥ తేటసొమ్పాణిముత్తెలు మోముచుట్టును శ్రీకరం బగుహారిబీకె వెలయ
పచ్చనిపైఠాణి పట్టుజానంబును డంబైనపసిడిపల్లంబుదనర
నరుదార మగఱాయంకవన్నియల రత్నవిచిత్ర మగుఖలీనంబు మెఱయ
తళుకులకోరికోలలపొదల్ విప్పైన కళుకుఁ గ్రొంజికిలిసింగాణి విండ్లు

వ॥ వెండియు 67

క॥ ఆనరనాథకుమారుఁడు। వానరసందోహమెల్ల వంచించి వెసన్
నానానీడోద్భవములఁ। బై నేసెం దనదుడేగ పటుతరలీలన్ 68

చ॥ జిలుఁగు మెఱుంగు బంగరు విచిత్రపు దోరపుఁ ద్రాటిగజ్జియల్
ఘలుఘలుఘల్లుఘల్లు రనఁగాఁ బికిలిం బొడకట్టఁ జూపి నూ
కెలను నృపాలసూనుఁడు పుళిందులు నివ్వెఱఁగంద నేయ ను
జ్జ్వలముగ డేగ యూర్ధ్వగముగఁ జయ్యనఁ బక్షులపైఁ గడంగినన్ 69

క॥ గువ్వలు కౌజులు కూకటి। నువ్వలు లావుకలు కోళ్లు పూరేళ్లు మొదల్
క్రొవ్వినపులుఁగులగమి చూ। ళ్లువ్విళ్లూరంగ నప్పు డుర్విన్ వ్రాలెన్ 70

ఉ॥ ఆమృగయుల్ వినోదగతి నందఱు నొక్కెడఁ గాటిసీలికిన్
సమ్మతితోడఁ బూజ లిడి చయ్యన నామృగపంక్తులన్ విహం
గమ్ముల బట్టఁ జిక్కుములఁ గావడులన్ భరియించి వెంట రా
నమ్మనుజేంద్రసూనుఁడు రయమ్మునఁ ద్రిమ్మటిరాజధానికిన్ 71

గీ॥ ఇవ్విధంబున బ్రతిదినం బవ్వసుంధ, రారమణనందనుండు శృంగారవనవి
హారమృగయావినోదవిద్యాతిగోష్ఠి, వెలయుచుండె జనావళి వినుతి సేయ 72

ఉ॥ అంత సమస్తదేశముల నారఘునందనుకీర్తి సద్గుణా
త్యంతవయోవిలాసము లహర్నిశముల్ జనముల్ నుతింపఁదా
నంత విదర్భదేశవిభుఁడై తగుభోజుఁ డెఱింగి వేడ్క శు
ద్ధాంతమునన్ బ్రసంగగతి నవ్విధ మంతయుఁ దెల్పుచున్నెడన్ 73

వ॥ విని తత్సోదరి యైనయిందుమతి యావిఖ్యాతకౌతూహలం
బున నారాజకుమారశేఖరుని సొంపుల్ మీఱఁ బెండ్లాడఁగ
లుసుకొని నా కనుచున్ నిగూఢమతి లోలోనన్ వితర్కించుచున్
గనియెన్ దద్రమణీయరూపవిధ వక్రాంజాక్షి స్వప్నంబునన్ 74

గీ॥ కాంచి యక్కాంచనాంగి మేల్కాంచి కాంతు కాంచితస్థితి మది కెఱఁగందియుండి,
యిద్ధిరానందనుఁడొ కాక యింద్రసుతుఁడొ యిందులోఁ జక్కఁదనమున నీతఁడనుచు,

చ॥ కనుగొని యప్పుడే తమిని గ్రక్కున నక్కునఁ జేర్పనైతి నా
ఘనునితనుప్రభాఘనుని కౌతుకమోహకళాని రూఢితో

యని బలునాననూని యమితాననయై ధృతి నిల్పలేక క్రొ
న్ననవిలుకానితూపుల మునం జెరియన్ దనలోన నెంతయున్. 76

చ॥ కల యిది యెంత వింత మునుగన్నది విన్నది గాదయారె? భూ
వలయములోన నిట్లు దనవల్లభుచక్కఁదనంబు వాని నేఁ
గలయుట గల్గునో? నిజముగా ననువాఁడు పరిగ్రహించిన
ట్లలవడియుండె నాక? యని యద్భుతమంది విచారఖిన్నయై. 77

క॥ కలలోనైనను నవ్విభుఁ! గలయఁగ లేనైతి జెలులకతనన్ మేల్కొ
లపి నిఁక నెన్నఁడవ్విభు, నిలఁ జూచెద నను విచిత్ర మిది యను మతియున్. 78

క॥ కలలోఁ జూచిన నృపునిన్। గలయుదు నేవనిన వట్టికాంక్షయ గాదే
జలబింబితవృత్తస్థిత। ఫలమాస్వాదింప వాంఛ పడినట్లగదా. 79

చ॥ అని మది సంశయించు నహహా యిది యబ్బురమంచు నెంచు నె
య్యున ఘనసద్గుణోన్నతిఁ దదాకృతి మాటికి సన్నుతించు న
మ్మవనిజమూర్తియా నృపకుమారు మనోహరుఁ గాఁ దలంచు న
వ్వనిత నిజంబె మన్మథుని వంతల నెవ్వరు నోర్వ రిద్ధరన్ 80

వ॥ అని యివ్విధంబున నవ్వధూరత్నం బాత్మభవనూత్నప్రయత్నంబునఁ దనయా
త్మయందు దుర్భరంబగు చింతాభరంబు వయస్యలెఱుంగ రాదనియున్న యక్కన్ని
య తెఱం గెఱింగియు నెఱుంగనియట్లు తదీయసఖీబృందంబులో నమందానందకరవచ
స్సందర్భ నిర్జితమరందస్యంద యగు సునంద యయ్యిందువదనతో నిట్లనియె 81

ఉ॥ చామరో! పిల్వఁబిల్వఁ నొకసారియుఁ బల్కవిదేమి నెచ్చెలుల్
వేమఱుఁ బల్కరించఁ గడు వేసటఁ జెందెద వేమి యేమి కాం
తో మతిచల్లగాలికిని సోమునిరాకకుఁ దల్లడిల్లె ది
ట్లేమొకొ వింతవింతవగ లేర్పడె నిమ్మెడ నేఁడు చూడఁగన్ 82

ఉ॥ కొన్నెర తొంక నందునిచి కోమలపాణి మెఱుంగుఁ జెక్కుటల్
జేర్చుచు ఘర్మబిందువులు జిందఁగ లేనును మోవి వేఁడిని
ట్టూర్పులు వాడ విన్నఁదన మొందెద వేలొ? నృపాలబాలకం
దర్పునిఁ గాఁక సోఁకిన విధంబిటు గానఁగ నయ్యె నిమ్మెడన్ 83

గీ॥ పొనర సింధుసముద్భవాశ్వోత్తమంబు చిరుదహంసకకింకిణీస్ఫురణ మెలర ·
ధవళ మలహారి మెఱయ నంద మగులీల గ్రాలనటునిల్పిసాహిణీ మ్రొక్కుటయును

వ॥ గరుడారోహ మొనర్చుమాధవుక్రియన్ గాండావతంసంబు ౭౦
ధురలీలాగతి నెక్కి రాసుతుఁడు దోడ్తో సైన్యముల్ గొల్వఁగా
గారంజక సన్నరమాల్ హొయిన్ సరిగవచ్చుల్ చెన్నునన్ జొకళిం
చ రవారంబుగ వాద్యనాదములు దిక్చక్రంబునం నిండఁగన్ 55

చ॥ రుచిరతరాతపత్రపితరోచులవేల సుధాంశుచంద్రికా
రుచులఁ దృణీకరించఁగ మరుత్ప్రతతుల్ సిగ నొప్పనిద్ధరుక్
విచికలసూనవాసనల విస్తరిలన్ గవణంపుడాల్ దిశా
ప్రచయమున న్నటింపఁగ «సెబా సగు షోడ» యటంచు మెచ్చుచున్॥ 56

చ॥ కలపము వాసనల్ దిశలఘుమ్మని క్రోలఁ గడానిపావడల్
వెలయఁ బురంధ్రిరత్నములు వేడుక ముత్తెపుసేసఁ జల్లఁగా
వలరులవిల్తువైఖరి సొయారము మీఱి నృపాలనందనుం
డలరుచు వేఁటకై చన రయంబున వేఁటరులెల్ల నత్తఱిన్॥ 57

చ॥ వలలును బోటుకోలలు సివంగులబండ్లు ముకుందుబల్లెముల్
తలముడు లుర్లు బోనులు తెరల్ మెఱుఁగీటెలు ప్రోగుమొట్టులున్
చిలుకులు చిల్లకోలలు విచిత్రసబా ఖసురాది సాధనం
బులు దవరంగ వెంబడిని భ్రాంగి చెలంగుచు నేగి రొండొరుల్ 58

చ॥ సెల వగువాయువేగి బలుసేర్పరి గద్దరి యొక్కగుంపు వే
కలములమిత్తి బెబ్బులులగండఁడు దొంగలవైరి యొక్కటిం
దెలుఁగులగొంగ చిచ్చుపిడు గీలలపోతు తుపాకి నాఁగఁబే
ర్లలరెడిసారమేయముల నత్తఱిఁ దెచ్చిరి కొందఱుద్ధతిన్ 59

వ॥ మఱియు సాళువంబులగని శరంబులు వారణంబులు బేసడంబులు జలకట్టెలు తళుకుమించు మొద లగుడేగలం గరంబులఁ గలబెత్తంబుల హత్తించి సొత్తంబుగఁ గొందఱు దేర-వనేచరప్రదర్శితమార్గంబున నిరర్గళగతి నక్కమారుండు గండభేరుండ వేదండచండపుండరీకకోదండకాండద్వీపశ్రేముఖ నిఖిలస్వాపదశరణ్యం ॥ బగు నొక్క

మహారణ్యంబు దరిఁజొచ్చి యచ్చట నచ్చట మెచ్చు దనర్చు వెలఁగ, పుల్లవెలఁగ, రేఁగు, గంగరేఁగు, నేరే, డల్లోనేరేడు, మోదుగుములు, కొండుగు, బీరపిచ్చుక బీఱ మేడి బ్రహ్మమేడి, జువ్వి, కలజువ్వి, నెమ్మి, జమ్మి, కొమ్మికానుగ, వేణుతురు' మద్ది, బొద్దుగ, వావిలి, యిందుగు మొదలగుతరుల వఱలుపొదల రొదలఁ బొదలురకము గలమెకము లడరుజాడ లరసి తత్తదుచితస్థలంబుల దెర వెత్తించి వలలు పొత్తించి మాటులు పెట్టించి తెరవులు గట్టించి పోటుకోలలు నించి యోదంబులు ద్రవ్వించి బిసలొడ్డించి భేరీమృదంగతమ్మటప్రముఖతూర్యంబులు గొట్టించి శంఖకాహళంబులు చిట్టించి వహ్నియంత్రంబులు ముట్టించి చంచదాఖేటకక్రీడాచుంచు లగునచ్చెంచు లందఱు నవ్వనంబును ఘూర్ణిల్లం జేసిన॥ 60

మ॥ అదరెన్ ఖడ్గవరాహమర్కటలులాయానీకముల్ మిక్కిలిన్
బెదరెన్ ఘోరమృగేంద్రపంక్తులు కడున్ భీతిల్లె వేదండముల్
చెదరెన్ వ్యాఘ్రకదంబముల్ భయమునన్ జెట్టాడె భల్లూకముల్
చదలన్ ద్రిమ్మరెఁబక్షిసంఘము దిశల్ డాసెన్ మృగవ్యూహముల్॥ 61

సీ॥ గర్జాసముజ్జృంభికంఠీరవంబులఁ గలుషటీకలఁ గ్రమ్మి కడకుఁ జిమ్మి
మెండైన గండభేరుండతండంబుల ఖడ్గాన నేసి తునకలుగఁ జేసి
చండిమోద్దండవేదండకాండమ్ములఁ గుంభమ్ములగలంగఁ గొట్టికొట్టి
రొప్పుచు నెదురించు గొప్పపులులగుంపుఁ బోనీక జముదాళ్ళఁ బొడిచిపైచి

గీ॥ ఘోరముష్కర సంరావఘోషితతుల, వెంబడిగఁ గుర్కురమ్ముల విడిచితరిమి
అట్టిటు దొలంగి పోనీక చుట్టుముట్టి, వేఁట లాడిరి మృగయులు వేడ్క లలర 62

గీ॥ చెంచు లాఖేటకక్రియాచుంచు లపుడు, సొందొరయలమెచ్చికొనుచు! నుద్దండలీల
చండవేదండముఖ సత్త్వసమితినెల్ల, గండడంచిరి దోర్బలాఖండు లగుచు॥ 63

క॥ శరభాసితదోర్లీలన్। శరభావళి రాజసుతుఁడు చయ్యనఁ దునిమెన్
కరఖడ్గనిశితధారన్। కరిఖడ్గాదుల వధించె ఘనశౌర్యుఁ డనన్॥ 64

క॥ ఘనసత్త్వమహితభూదా। రనికాయము నేఁచునట్టి రాసుతుఁ డతనిన్
ఘనసత్త్వమహితభూదా। రనికాయముఁ గూల్చె నపుడు రాజత్రోపధిన్ 65

ఆ॥వె॥ ఔరా! చంద్రహాసహారి యానితఁ డనఁ బుండరీకతతులఁ బొల్పుమాన్చెఁ
తనరుసింహాసంహాననుఁ డీవిభుం డన, ఘనత సింహసంహనన మొనర్చె॥ 66

క॥ విను మానృపాలచంద్రుం । డనుమానము మాని మోహ మందుచు మది కిం
పానరంగ వింతపల్కులు । దనరన్ మత్కరముఁ బట్టెఁ దద్దయు వేడ్కన్ 90

గీ॥ కరముఁ బట్టినఘంతోపకరము గాఁగ, కరము మదిఁ బుట్టుసుస్నేహ కలవలనఁ
గాంతుఁ జెందితిఁ గాని యాఘనుని పేరు, హర్షమలరంగఁ దెలియంగ నడుగనైతి॥

గీ। అంత నతఁడేమి దలఁచెనో యాక్షణంబ, కోవిదారధ్వజంబు చేకొని నిజాంతి
కమున సేకభృత్యుఁ డరుదేరఁ గ్రమ్మఱుటయు, నపుడు మేల్కంటిఁ జెలులవా
క్యారవముల 92

చ॥ అది మొద లానృపాలుని శుభాకృతి కన్నులఁ గట్టినట్లు నా
మది వలపించుచున్న యది మారుని రాకను నోర్వ రాదు గా?
మదగజయాన? సత్యముగ మర్మముఁ దెల్పితి నీకు నుర్విలో
విదితములోఁగదా, శశిరవిప్రథితాన్వయరాట్చరిత్రముల్ 93

మ॥ అతఁ డేరాజకుమారుఁడో! యెఱుఁగ నమ్మా కొమ్మరో? వానిపై
మతి యత్యంతవిలగ్న మైనదిసుమీ మద్భాగ్య నీడేర్పుమీ
యితరం బెద్ది వచింప నేమి తనప్రాణేశుండు వాఁడేసుమీ
యతివేగంబున వానిచొప్పరయుమీ? యాలస్య మిం కేటికిన్ 94

చ॥ అనిన సునంద యిందుమతి నాదరణంబునఁ జూచి మందసం
దనయమృదూక్తులన్ జెలిమి దాకొనఁ బేర్కొన రానికూర్మి నె
మ్మనమునఁ దోఁపఁ బల్కె విను మానిని? నీకనుమాన మేల? యా
జనవరుఁ డల్లసూర్యకుల సంభవుఁ డారఘు సూనుఁడె సుమీ 95

క॥ అది యెట్లనఁ దెలిపెద నో। మదవతి? యిక్ష్వాకువంశ మనుజేంద్రులకున్
విదితముగ బిరుదు ధరకో। విదారతరుకలితకేతు వితతియె కాదే? 96

క॥ ఆకేతనంబు గల్గిన। రాకొమరుఁ డజాఖ్యుఁడతని రాణించెద నో
రాకేందువదన? యావిభు। నీకుం బతిఁ జేసె బ్రహ్మ నేర్పరి సుమ్మీ॥ 97

ఉ॥ కాత్సవరప్రసాదమునఁ గల్గినవాఁడు నిజాప్తబంధుతా
వత్సలుఁ డైనవాఁడు జనవల్లభరత్న కిరీటకాంతిసం
పత్సదలంకృతాంఘ్రి యగువాఁడు కరాసివిఖండితారిభూ
భృత్సముదాయుఁ డంబుధిగభీరుఁడు రాఘవుఁ డంబుజాననా॥ 98

క॥ మున్నుగని వినియెఱు నున్నన్, గన్నులఁ గనుఁగొనినయట్లు ఘనమోహసము
ద్భూతి నన్యనృపాలుర, కన్నియలను గోరఁడతఁడు ఘననిభవేణీ 99

శా॥ ఆ రాజన్యకుమారవర్గములయం దదీయాత్యంతసౌందర్యరే
ఖా రాజద్గుణ వైభవాదు లెఱుఁగంగా నొక్కవిప్రోత్తమున్
గా రా మొప్పఁగఁ బంపఁగావలయు నో కంజాక్షి యట్లైన వాఁ
డారూఢి న్నినుఁ బెండ్లియాడఁగలఁ డత్యంత ప్రమోదంబునన్ 100

క॥ అని పలికి కలికి యానతిఁ, జని చిలుకలకొలికి యొక్క సద్బ్రాహ్మణవ
ర్యుని ఘను శివశర్మాఖ్యుం, గని రారమ్మనుచుఁ బిల్చి కడువేడుకతోన్ 101

గీ॥ అనఘ? కళ్యాణకార్యార్థమై నృపాల సహజసాకేతనగరికి సరగనిన్నుఁ
పయన మొనరింపఁ బిల్వఁగఁ బంపెననిన హర్షమలరంగ నపుడా ధరాసురుండు 10

సీ॥ సితశోణరేఖావిచిత్రితోష్ణీషంబు సురధునీయుత జటాభరము గాఁగ
తతభాలభసితభాసితచందన త్రిపుండ్రాక్షు తారుణిమ నేత్రాగ్ని గాఁగ
వరచక్రఖచిత సౌవర్ణకర్ణవిభూషణములు కుండలికుండలములు గాఁగ
గళహారరుద్రాక్షు బలహారిమణినీల కళహాలహాలకంఠ కాంతి గాఁగ

గీ॥ మేలినీర్కావిదోవతి మీఁదిపట్టుపవ్వళిమణుంగు పులితోలు పటిమ గాఁగ
తగును శివశర్మ యనుట యాధన్యున కన శివునివలె వచ్చె నవ్వేళఁ జిత్రలీల 103

గీ॥ అయ్యెఁ ముందుగ విచ్చేయుఁడని సువాస చేయునూపఁగ డాపక్రొంజికిలితిన్నె,
లమరులోపలి కక్ష్యాంతరములు దాఁటి యిందుమతిమ్రోలనిలిచి మహీసురుండు 104

క॥ ద్విజరాజదర్శనంబున, నిజనయనచకోరములకు నిబిడానందం
బు జనింప హృదయపీఠిక, నజరాడ్దర్శనవిలాసమంది చెలంగెన్ 105

ఉ॥ ఆరమణీలలామ రవయుం దెలు ఘల్లుమనంగ లేచి బం
గారపుబొమ్మకైవడిని గ్రక్కున విప్రునిపాదపద్మముల్
చేరి నమస్కరించుటయు శీఘ్రమె పెండ్లిసమార్తవౌదు వం
భోరుహపత్రనేత్ర యని పొల్పుగ దీవనఁ జేసె నయ్యెడన్ 106

గీ॥ ఇట్లు దీవించి శివశర్మ యిందుమతి సఖీమణుల్ నిల్పునవరత్న హేమపీఠి
నధివసింపుచు నర్ఘ్యపాద్యాదులాసఁగఁ గైకొని నితాంతసంతోష కలితుఁడగుచు

క॥ అందపుఁజిలునవ్యాధరము। సం దళుకొత్తంగ మధుర నయతరసూక్తుల్
పొందికవహింప నపుడా। యిందుమతి పురోహితునకు నిట్లను వేడ్కన్ 108

ఉ॥ ఓరమణీయ సద్గుణగణోదయ! యోశివశర్మ! నీపదాం
భోరుహదర్శనంబు ఘనపుణ్యవశంబున గల్గె నోకృపా
వారిధి! నాదుస్వప్నమున వచ్చె నొకానొక రాజనందనుం
డారమణీమనోహరు నెయార మయారె! నుతింపఁ జెన్నగున్ 109

ఉ॥ ఆరసికావతంస మజుఁడంచు సునంద మనంబులోనఁ దా
నారసి తెల్ప నాహృదయ మవ్విభుఁజేర భవత్సుధీచమ
త్కారము నాపయింగలుగ కారుణికత్వ మెలర్ప మీర లెం
తే రఘుసూనునిం గని మదీయవిధంబెఱిఁగించి రాదగున్ 110

క॥ నావుడుఁ బరమోత్సాహస। మావిర్భావస్ఫురన్నిజాంతఃకరణుం
డై విప్రవరుండనియె నృ। పావరజామణికి మిగుల హర్షం బెసఁగన్ 111

శా॥ ఎంతేఁ దావకపూర్వజన్మసుకృతం బీడేఱె నా నెమ్మదిన్
సంతోషించితి నీదుభాగ్యమునకున్ జంద్రాననా! మేదినీ
కాంతాగ్రేసరులందు నయ్యజునితోఁ గంతున్ వసంతున్ నిశా
కాంతాకాంతు జయంతు సాటియన శక్యంబౌనె శాతోదరీ 112

ఉ॥ మంచిదికొమ్మ? యీనృపకుమారుని పాలికిఁబోదునమ్మ పా
టించి శుభంబు నీకిదె ఘటించెద బంగరుబొమ్మ? నిన్ను వ
ర్ణించి యతండు శీఘ్రమె వరింప నొనర్చెద ముద్దుగుమ్మ ని
శ్చంచలతన్ మదుక్తి సహజమ్ముగ నెమ్మది నమ్మి నెమ్మిగన్ 113

క॥ అనిపలికి కలికి బహుమతి। ఘనమతి ననుమతి యొనర్పఁగా మోదముతో
వనితామణి వీడ్కొని య। య్యనఘుఁడు నిజగృహముఁజేరి యాత్రోన్ముఖుఁడై 114

సీ॥ వలిపె నీర్కావిదోవతిఁ జుట్టి శిరముపైఁ బూన్చినశాస్త్రిక పుస్తకంబు
దావళి మడిపట్టుదోవతి దేవపూజాపేటిఁ గలమూట చంకతాళి
వేలిమి సమిదగ్రోవియు వేణుదండంబు వలకేల డాలీవ వ్యాజనమొకటి
యురమున రుద్రాక్షసరములు ముంజేత జపమాలికయుదాల్చి సత్వరముగ

గీ॥ తండులాదికతామ్రపాత్రములతోడ నెసఁగుసంచియు నగల బొక్కసముదాల్చి
వెంటశిష్యుండు చనుదేర విప్రముఖ్యుఁడజునిఁజూడ నయోధ్యకు నరిగెనంత 115

మ॥ చని యవ్విప్రుఁడు కాంచెఁ గాంచనకనత్సౌధాగ్రజాగ్రన్మణీ
ఘనకాంతిచ్ఛల శక్రకార్ముకయుతా కాశాగ్రజీమూతభం
జనకృత్కేతనజాతనూతన మరుజ్జాతంబు కేళీవనా
వని యౌన్నత్యతిరస్కృతామరతరు వ్రాతంబు సాకేతమున్ 116

క॥ ఆరీతిగాంచి భూసురుఁ। డారఘునందనునినగరి కరిగి తదీయో
దారమణిఖచితగృహాళిం। గారము వీక్షించి వేడ్కఁ గడలుకొనంగన్ 117

సీ॥ ఔర! హీరాధార తోరణోత్తంభిత స్ఫాటికస్తంభ శుంభన్నిరూఢి
బాపురే! రత్నకలాప గోపురస్థితశాత కుంభకుంభప్రభా జృంభణంబు
మేలు జాలకజాలకీలితశైలభిన్న లోపలోజ్జ్వల నిబిడదీప్తి
వింత! సంతతచంద్రకాంతకాంతనిశాంత సంతత్యనంత నితాంతకాంతి

గీ॥ మాయురే! భూరిమహనీయమణినికాయ। హాటకవిటంకటకవాట పాటవంబు
లని మనంబున వెఱఁగంది హర్షమంది రఘునృపకుమారవరుహజారమున జేరి 118

ఉ॥ చేరి పదాంతరాంతరవిచిత్రము లారయుచున్ సభాముఖ
ద్వారమునందు శిష్యుఁడును దాను నిలంగని పోనఁ బోవ డౌ
వ్వారలు మీరు వింతవగవారని భీకరవృత్తిఁ బల్కఁడా
వారికతోడ భూమిసురవర్యుఁడు వల్కెఁ బ్రగల్భవైఖరిన్ 119

గీ॥ హితులము విదర్భరాట్పురోహితుల మస్మదాగమనకార్యమజునికల్యాణహేతు
వతనికృప గల్గ మాకుఁ గల్యాణలాభ మొనరు నీకును బహుమాన మొనరునిపుడు 120

క॥ నావుడు దౌవారికవరుఁ। డావిధమంతయును దెల్ప నజుఁడాధరణీ
దేవుం దోడ్కొని రమ్మని। వేవేగను బనుప నతఁడు వేడుకతోడన్ 121

క॥ రా రమ్మనుటయు విప్రుం। డారూఢి న్వివిధభూషణాంబరయుతుఁడై
చేరఁ జనుదేర రాజకు। మారుం డత్యంతముదిత మానసుఁడగుచున్ 122

సీ॥ గద్దియడిగ్గుచోఁ గళుకుబంగరురత్న గండపెండేరంబు ఘల్లు మనఁగ
పా కరమైచుచోఁ భామాకరాంచన్మణీకంకణాళి ఘణిల్లు రనఁగ

పాదుకల్ మెట్టుచోఁ ఒటువేత్రధరపాళి దల్ల సాహోధ్వనుల్ ఘోల్లుమనఁగ
సిగవేఁగ జారుచోఁజి కిలిసంపగి పూల జల్లుతేనియ పెల్లు చిల్లు మనఁగ
గీ॥ నల్ల నల్లన నరిగి తదంఘ్రియుగళి, కర్థిఁ బ్రణమిల్లి యర్ఘ్యపాద్యాదు లొసఁగి
కనకమయ పీఠమున నుంచి గారవించి, హితనయమ్ము దూక్తు లెనయంగనిట్టు లనియె॥
క॥ ఏయది మీశుభనామం । బేయెడ నుండిటకు మీరలేతెంచితిరో
యేయది కర్తవ్యంబు మ । దీయమనోభీష్ట మిప్డు తీరియెటర్వన్ 124
క॥ మీవంటివిప్రముఖ్యుల । సేవించుట మమ్ముబోఁటి క్షితినాథులకున్
భావిశుభకారణం బౌ । గా వేరే వేఁడఁదగినకార్యము గలదే 125
వ॥ అనిన నమ్మహీసురుండు రఘునందనున కిట్లనియె. 126
గీ॥ పేరుశివశర్మ యండ్రునన్ బ్రథితవిజనులు, కుండినపురంబునం దుండి నిండువేడ్క
నిన్నుఁ బొడఁగాంచ వచ్చితి నృపకుమార, యనిన ధరణీసురేంద్రుతో ననియె నతఁడు
మ॥ ధనధాన్యాదిసమస్తవస్తువులచేఁ దద్దేశ ముప్పొంగునే?
వనితాపుత్రపురోహితాప్తసచివవ్రాతంబుతో భోజుఁడున్
జనులన్ సత్కరుణాధురీణశుభవీక్షారూఢిరక్షించునే?
తనతోఁబుట్టువ యైనయిందుమతి కుద్వాహంబు గావించునే? 128
క॥ వినియుందు మిందుమతి న । వ్వనజాననరూపసుగుణవైభవగరిమల్
గనియుండుదురే యన య । జ్జనవరసుతుతోడ విప్రచంద్రుం డనియెన్ 129
క॥ వినుము రఘురాజనందన । యనుదినమున్ భోజరా జహర్నిశము దా
నను జకుఁ దగుమనుజవిభుం । గనినప్పుడె పెండ్లి సేయుఁగాఁ దలఁచి మదిన్ 130
గీ॥ తెలియుచున్నాఁడు భూపాలకులఁ దదీయ, సోదరియు నీదుసౌందర్యశుభగుణప్ర
భావముల్ విని మోహవిభ్రాంతి నిటకు, రాయభారంబుఁ బంపె భూరమణతనయ
క॥ ఇలలో మఱియుం గలజగ । ములలో నలరాజవదనఁ బోలినచానం
గలలో నైనను గానం । గలలో హాయనగ మెఱుగుకైవడిఁ దనరున్ 132
ఉ॥ కప్పురగంధి యాధరణికాంతతనూజ నృపాలచంద్ర? పి
న్నప్పటనుండియున్ జెలువ మందినచందము లెన్న శక్యమే
యప్పరమేష్ఠికైన వినుమైనను నేర్చినరీతి దెల్పెదన్
ముప్పిరిగొన్న వేడ్క మది ముచ్చట లెచ్చఁగ సావధానతన్ 133

శా॥ ఈభోజాధిపుత్రుండై భోజుఁ డన నెంతే మున్ను రంజిల్లఁగా
నాభూమీశ్వరుఁ డేలెఁ గుండినపురం బానందసంధాయియై
భూభామిన్యధికప్రమోదకరి వీ పొల్పొందఁగా దోహద
శ్రీభాగ్యోన్నతిఁ దత్సతీమణియు భాసిల్లెన్ నవీనస్థితిన్ 184

ఉ॥ చిట్టుము లంకురించె జిగి చెక్కులఁ దెల్పు నటించెఁ గోరికల్
మట్టు దొరంగె నెన్నడల మాంద్యవిధంబు చెలంగెఁ గూర్కులోఁ
బెట్టి గమించె నెన్నడుము పెద్దతనంబు వహించె వేవిళుల్
దట్టములై జనించె నిటు తామరసాక్షికి నాఁడునాఁటికిన్ 185

క॥ చూచుకములందు నెంతయు, మేచకరుచి మించెఁ జాల మృత్సౌరభముల్
వాచవులై తగి బడలిక, ప్రాచుర్యము నొందె నొడల భామామణికిన్ 186

చ॥ అలరిననిండుప్రేమమునఁ బ్రాణవిభుండు మనోరథంబు స
త్ఫలత వహింపఁ జేయఁగ ముదం బలరన్ సుఖలీల నుండి ప్రా
ద్దులనెలఁ జొచ్చునంతట వధూమణి పుత్రికఁ గాంచె వేడుకన్
లలితమనోజ్ఞమూర్తి శుభలగ్నమునన్ హృదయంబు రంజిలన్ 187

సీ॥ అలపాలవెల్లిజాబిలిరేక యుదయించి నానాఁట రహిఁ గుల్కు నయము గాంచు
తళ్లుముత్తెపుచిప్ప దనరారె ముక్తికం బభివృద్ధిఁ జెందిన యంద మంది
గనియందు వెలసిచక్కనిరత్నపుశలాక యంతంత డాల్ మించు నసువు గాంచి
కల్పవృక్షమునందుఁ గల్గు ప్రసూనంబు సద్వాసన నెసంగు చంద మంది
గీ॥ బాలభోజవధూటిగర్భమునఁ బుట్టి విస్మయమ్ముమీఱ నెంతయు వేడ్కఁ బెరిఁగి
దినదినప్రవర్ధమాన కేదీప్యమాన దివ్యకళ లెల్ల దిక్కులఁ దేజరిల్ల 188

ఉ॥ చందురువంటి నెమ్మొగము సౌరు చెలంగిన ముద్దుపట్టికిన్
బొందిక మీఱ భూవరుఁడు పుణ్యదినంబున వైభవంబు చె
న్నొంది ధరామరేంద్రుల శుభోన్నతవాక్యము లుల్లసిల్లఁగా
నందము మీఱ నిందుమతియన్ దగు పేరొనరించె వేడుకన్ 189

ఉ॥ చొక్కపురత్నపుందళుకు సోయగపున్నెరపెంపుతొట్లలోఁ
మక్కువనుంచి తేటపగమాటలు నీటెనయన్ సువర్ణస

మ్యక్కరకంకణ ధ్వనులు మాక్కలయం గొలుసుల్ గదల్చుచున్
జొక్కుచు రాజనందనకు జోలలు పాడుదురంగనామణుల్ 140

సీ॥ నిద్దంపుబంగారు మద్దికాయలడాలుపాలబుగ్గలమీఁదఁ గేళిసల్ప
రారేకనుదుటిపై రత్నాలక్రొందళుక్కు రావిరేక బెడంగు రహిఁ జెలంగ
తీరైనగళమునఁ దోరమైనకడాని జాళువాపులిగోరు తూలియాడ
నును లేఁతతమ్మితూఁడనఁ బొల్చుసందిటికడ వన్నెతాయెతుల్ కళలుమీఱఁ
గీ॥ గళుకుపాంజెళుక్కుచెందురుకావిజిలుఁగు పావడమెఱుంగు చిన్నారిపైఁడిసోగ
గిలుకుటందెలబలురవల్ వలనుమీఱఁ దప్పటడుగుల నృపపుత్రి దనరెనంత 141

ఉ॥ తద్దయుఁ దల్లిదండ్రులు ముదంబునఁ గౌఁగిటఁ జేర్చి చెక్కులన్
ముద్దిడుకొంచు గాగవపు ముచ్చటప్రోదియొనర్ప దాదులా
ముద్దియ లెయ్యెడన్ నెనరుఁ బూనుచుఁ బెంప నృపాలపుత్రి బల్
సుద్దులముద్దుముద్దుగఁ జూపుచు రంజిలె నాఁడునాఁటికిన్ 142

సీ॥ ఒకవేళ రత్నాలచకచకల్ వెదఁజల్లు బంగారుతళుకుమేల్బంతి గొట్టు
నొకసారి మిక్కిలియొయ్యారి వగ మీఱి ముదమొప్ప దాఁగిలిమూఁత లాడు
నొకపరి యానంద మొప్పంగఁ జెలరేఁగి మెప్పుచు వెన్నెలకుప్ప లాడు
నొకమరి గెల్పొందునురులీలఁ దనరుచుఁ గొమలతో వామనగుంట లాడు

గీ॥ దోయముల్ సరిబేసులు దొరయునాల్లు, గంబములయాటలచ్చనగండ్లు మొదలు
గాఁగ శైశవగరిమ శృంగార మలర, బాలికలతోడ నాడు భూపాలపుత్రి 143

కం॥ భావ్యజపత్నీ భావము । భవ్యగతిం దెల్పులీల బాలామణి దా
నవ్యతరగీతసాహి । త్యావ్యయమహిమన్ దనరె నద్భుతరీతిన్ 144

చ॥ రుచిరతరార్థగుంఫనము రూఢిఁ దగన్ మకరందమాధురీ
విచికలసౌరభప్రతిభ విస్తరిలన్ ధ్వని యానలంక్రియా
ప్రచయ మెలర్ప నిందునుతి బంధురధార చెలంగ సాహితీ
రచన యొనర్చు నాసుకవిరాజమణుల్ తనవాక్కు లెన్నఁగన్ 145

కం॥ ఈరీతి వివిధవిద్యా । పారీణతఁ దనరి యానృపాలప్రియపు
త్రీరత్నము గురుజనహి । తారూఢిన్ వెలయు మిగుల నంచితలీలన్ 146

సీ॥ నూఁకటివేళిరోఁ గురులుగూడుకొనంగ మేలినిద్దపుమేను మెఱుఁగెసంగ
చిన్నారినగుమోముజిగి వింత కళఁ జెందఁ దళుకుఁగన్నులాకింత బెళుకుఁ బొంద
మగరూపుఁ గన్న నెమ్మది గొంకువగ మీఱ తేటమాటలఁ గొంత తేనె లూర
వాతెర కెంజాయువగ మాధురి వహించ (ప) మొలకచన్నులనిగ్గు మొవసిమించ
గీ॥ నడలు గులుకొంగ నూగారు నల్లెసంగఁ, గటి విజృంభింప నణఁకువ గానిపింప
నలవిదర్భనృపాల కన్యాలలామ, కద్భుతంబుగ యౌవన మంకురించె 147
గీ॥ చికిలి గాంచినమదనుని చేకటారి, మెఱుఁగువగ మించుబంగారు మెఱుఁగుబొమ్మ
యామనిఁ దవప్పు పూఁదీఁగె యనఁగ వెలసె, నింమమతి యౌవ్వనప్రౌఢి నెనయు
నపుడు 148

ఉ॥ రామశిశుత్వనాపుశిశిరర్తువు బోఁ దగ యౌవ్వనాఖ్యచై
త్రామితలీలచేఁ దనులతాంచితపల్లవకోరకాళిరే
ఖామృదుగుచ్ఛమాధురసగౌరవముల్ గనుపట్టె నట్టిచో
భూమివరాగ్రగణ్యః మను బోఁటులకు న్నుతియింప శక్యమే 149
క॥ ఆరమణీమణిసాబగే। భూరమణులకన్నెలందు ముందు విన్నది గా
దారామచక్కఁదనమో। శ్రీరాముమునైనఁ గలదె చింతింపంగన్ 150
గీ॥ రహిఁ బ్రవాళాఖ్యవిద్రుమప్రౌఢి మహిని, మానవ సమానియమ్యాస్యమైత్రి చిగురుఁ
బగడముచు దత్పదద్వయప్రభకు నెడెఁ, ధరణి నాపలగతిని ఛిద్రమును బొందె 151
సీ॥ తొలుదొల్తఁ గలతమాయులరుచి తొరంగి కలమగర్భములు కొండల వడంగ
తలచూప వెఱచి యెంతయు భీతిమకరికల్ వనరాశి నడుమను మునిఁగి యుండ
అగ్గికాఁకలఁ జెంది యపఁజి కాహళుల్ దొరలవాకిళు లందు మొఱలిడంగ
గిరిపరికాననాంతర ధరాస్థలులందు సలిలవేణికలు వంకలువడఁగ
గీ॥ మెఱుఁగుతూణీరములు మహీపతులవెనుక, పార్శ్వములఁ డాఁగియును శరపాళిపాలు
గాఁగఁ జేసి చెలంగునక్కఁటుకంరి, యొఱపుమీఱిన జంఘికాయుగళి మనకు 152
చ॥ కుచములతో నెదిర్చి మనుకుంభము లంకుశబాధఁ జెందఁగా
సుచరితయూరు లేఁదొడలుఁ జూచుట దప్పని దంతికేలు వ్రో
మచలననైజవైఖరి నమస్కృతి సేయఁగనే సమంచిత
ద్రుచి కనిన ట్లనంటిఫలధూళ్ళలనక్ సతిఁ జెందు నెంతయుక్ 153

